చందా వివరములు
ఆంధ్ర దినపత్రిక

| | రూ. | [నయా పైసలు] |
|---|---|---|
| (ఆదివారపు సంచికతో సహా) | | |
| సంవత్సర చందా ... | 28 | 00 |
| అర్థ సంవత్సర చందా ... | 14 | 00 |
| 3 మాసముల చందా ... | 7 | 00 |
| నెల చందా ... | 2 | 50 |
| విడి ప్రతిసాధారణదినములలో ... | ,, | 7 |
| ఆదివారపు దినపత్రిక ... | ,, | 18 |

ఆంధ్ర పత్రిక — మద్రాసు-1.

# ఆంధ్రపత్రిక

3|9519

చందా వివరములు
బుధవారపు సచిత్ర వారపత్రిక

| | రూ. | [నయా పైసలు] |
|---|---|---|
| సంవత్సర చందా ... | 13 | 00 |
| అర్థ సంవత్సర చందా ... | 6 | 50 |
| విడి ప్రతి ... | ,, | 25 |
| భారతి (సచిత్ర మాసపత్రిక) | | |
| సంవత్సర చందా ... | 12 | 00 |
| అర్థ సంవత్సర చందా ... | 6 | 00 |
| విడి ప్రతి ... | 1 | 00 |

ఆంధ్ర పత్రిక — మద్రాసు-1.

The Andhra Patrika - Madras సంపుటం 44. సంచిక 93 FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO గురువారం 4-7-1957 Reg. No. M. 1118 6 పేజీలు 7 నయాపైసలు


# ప్రస్తుతం కొత్తపన్నుల ప్రతిపాదనలు లేవుఅని గోపాలరెడ్డి ప్రకటన

## 'ధనం కూర్చుకోలేక కేంద్ర సహాయాలను వాడుకోలేకున్నాము'

## ఖర్చుల అదుపు కుదరడం లేదు: రూ 1049 లక్షలు అదనంగా లభించే మార్గం చెప్పండని అభ్యర్థన

["ఆంధ్రపత్రిక" ప్రతినిధి]

హైదరాబాదు, జూలై 3: "ఓం ప్రథమంలోనే కొత్త పన్నులు ఏవీ ఈ ఆయవ్యయ నివేదికలో ప్రతిపాదించడం లేదు" అని ఆర్థికమంత్రి డా॥ బెజవాడ గోపాలరెడ్డి ప్రకటించారు.

ఈ ఆయవ్యయ నివేదిక సాధారణ పద్ధతిలో ఉండదనీ, తెలంగాణా ఆదాయం తెలంగాణాకే ఖర్చు చేస్తారనీ, ఖర్చులపై అదుపులేకుండా పోతున్నదనీ, కేంద్రం చేస్తాననే సహాయానికి తోడుగా రాష్ట్రప్రభుత్వం ధనం కూర్చలేక లక్షిత ప్రయోజనాలను (ఉపాధ్యాయులకు జీతాలవృద్ధి లాంటివి) సాధించలేక పోతున్నదనీ ఆర్థికమంత్రి విచారం వెలిబుచ్చారు.

రూ 1049 లక్షల అదనపురాబడి వస్తే పనులు సాగుతాయనీ, అది లభించేటందుకు సభ్యులు ప్రజలు తోడ్పడాలనీ విజ్ఞప్తి చేశారు.

ఆర్థిక మంత్రి ఇలా ప్రసంగించారు: ఈసంవత్సరం నా బడ్జెటు ప్రసంగం సాధారణ పద్ధతిలో ఉండదు. సంప్రదాయంమార్చి మాట్లాడదలచుకున్నాను: ఆంధ్రప్రదేశ ఆర్థిక పరిస్థితులు వివరించి, ప్రత్యేకంగా తెలంగాణా పరిస్థితులు కూడ విశదపరచి, శాసనసభకొక యదార్థ చిత్రం సమర్పించి సభ అభిప్రాయాలు పత్రికల అభిప్రాయాలు, ప్రజల అభిప్రాయాలు తెలుసుకో గోరుచున్నాను. ఓం ప్రథమంలోనే క్రొత్త పన్నులు యేవీ యీబడ్జెటులో ప్రతిపాదించడం లేదని ప్రకటిస్తున్నాను. రాష్ట్రపు యథార్థ ఆర్థిక పరిస్థితి పరిశీలించిన తరువాత, దీని విషయమై శాసనసభ్యుల అభిప్రాయాలూ, సలహాలూ తెలుసుకొన్న తరువాత మన ఆర్థిక పరిస్థితిని బాగు చేయడానికి స్థిరమైన సక్రమ చర్యలు తీసుకోవలసి వుంటుంది.

### ఘన కష్టాలు మనమే అనుభవించాలి

ఇతర రాష్ట్రాలు కూడా లోటు బడ్జెటు తయారుచేస్తున్నాయన్న సంగతి మనకు సంతృప్తికారణం కాజాలదు. మన పరిస్థితి మనం సింహావలోకనం చేసుకోవాలి. తరువాత మనం అనుసరించే పద్ధతివల్ల ప్రజానీకం పట్ల మన విధ్యుక్త ధర్మం మనం నెరవేరుస్తున్నామా అనే ప్రశ్నకి నిష్కర్షగా మనకి మనం జవాబు చెప్పుకోవాలి.

రెవిన్యూఖాతాలో ఇప్పుడు మనం అధిక వ్యయం చేసి ఆ ఋణభారం మన తరువాతి తరాలవారికి అప్పజెప్పి ఊరుకోవడం ధర్మం కాదు. రాబోయే తరాలవారికి ఉపయోగించే నీటి పారుదల సౌకర్యాలూ, విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులూ నిర్మించడానికి మనం అప్పులు చేయడం సమంజసమే. అవి క్రమంగా వాయిదాల మీద చెల్లించుకోవచ్చు. కానీ నేటి శాంతిభద్రతల కోసం ఈ తరం వారి ఆరోగ్య, విద్య, రవాణా, ఇత్యాది సౌకర్యాల కోసం అప్పుచేసి ఆ ఋణభారం మన సంతతి మీద వేయడం న్యాయంగాని, ధర్మం గాని కాదంటాను. మన విలాసం కోసం, మన సౌఖ్యం కోసం కొన్ని సౌకర్యాలు చేసుకుని, అప్పుచేసి పప్పుకూడు తిని మన పుత్రపౌత్రుల మీద అభారం వేయడం నీతి గానీ, రాజ నీతి గానీ కాదు.

పంచవర్ష ప్రణాళిక రూపొందించడానికి కావలసిన ఖర్చులకోసం, ఇతర

(6 వ పుట చూడుడు)

## పన్నులు కాని పన్నులు

### సమన్వయం

హైదరాబాదు, జూలై 3: ఇవాళ శాసనసభలో ప్రతిపాదించిన బడ్జెట్ లో ఆర్థికమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి కొత్త పన్నులేవీ విధించక పోయినా ఆంధ్ర ప్రాంతంలో నీటి తీరువను పెంచేటందుకు చేశారు. తెలంగాణాలో కంటే ఆంధ్రప్రాంతంలో ప్రస్తుతం నీటితీరువ తక్కువ.

తెలంగాణాలో ప్రస్తుతం అమలులో ఉన్న వ్యవసాయాదాయాలపై "సర్ ఛార్జి" వసూలుచేసే పద్ధతిని అమలులోకి తీసుకువచ్చే సూచన నుబడ్జెట్ ప్రసంగంలో శ్రీ గోపాలరెడ్డి చేశారు. ఇంకా ఈ క్రింది ఆదాయ వృద్ధి మార్గాలను సూచించారు:

వాణిజ్య పంటలపై పన్నును ఎక్కువ చేయడం. ప్రస్తుతం అమలులో ఉన్న చట్టం ప్రకారమే ఇప్పటికంటే ఎక్కువ ఆదాయం సమకూర్చుకొనడానికి వీలుగా ఆంధ్ర ప్రదేశంలోని అన్ని జిల్లాలలోనూ ఒకేఒక పద్ధతిలో వినోద ప్రదర్శనలపై పన్ను, మోటారు బస్సుపై పన్నులను వసూలు చేయడం,

కొత్త పన్నులను విధించే బదులు ఇప్పుడు అమలులో ఉంటున్న పన్నులనే కట్టుదిట్టంగా వసూలు చేసి తక్కువ మొత్తాలకు నిలవ చేసేకార్యక్రమాలకు అధిక ప్రాముఖ్యం ఇవ్వడమే శ్రీ గోపాలరెడ్డి ఉద్దేశ్యం.

### తపాలా సెలవు

మదరాసు, జూలై 3: జూలై 9 తేదీ మంగళవారం మహమ్మదీయుల ఇద్ ఉల్ జుహా పండుగ నిమిత్తం తపాలా తంతి ఆఫీసులకు సెలవు.

## మైసూరు జైళ్ల ఇన్స్పెక్టర్ జనరల్ తొలగింపు

### కోలారు గనులలో ఇనపగొట్టాల మాయమైన ఫలితం

బెంగుళూరు, జూలై 2: మైసూరు ప్రభుత్వం, జైళ్ళ శాఖ ఇన్స్పెక్టర్ జనరల్ శ్రీ బి. తిమ్మరాజఅర్స్‌ను ఉద్యోగంనుంచి తాత్కాలికంగా తొలగించింది. వీరిదివరలో పోలీసు ఇన్స్పెక్టర్ జనరల్‌గాకూడా పనిచేసివున్నారు. కోలారు బంగారుగనులలో పోలీసు సూపరింటెండెంటుగా పనిచేస్తున్న శ్రీ యల్. సుబ్రమణ్యరావును సెలవుపెట్టి పోవలసినదిగాకూడా ప్రభుత్వం ఆదేశించింది.

కోలారు బంగారుగనులలో కొన్ని ఇనుపగొట్టాలు మాయం కావటంపై, అవినీతి నిర్మూలనశాఖ, ఆడిట్‌శాఖ కార్యకలాపాలను దక్షతతో పరిశీలించే మరో ప్రత్యేకశాఖలు, దరియాప్తుజరిపి కొన్ని అంశాలను బహిర్గతంచేశాయి. వీటికి అనుగుణంగా మైసూరు ప్రభుత్వం యీ అధికారులపై చర్య తీసుకున్నది. ఒకపోలీసు సబ్ ఇన్స్పెక్టర్‌ను కూడా తాత్కాలికంగా తొలగించారు.

ఈ విషయమై విచారణజరిపి ప్రభుత్వానికి నివేదిక సమర్పించవలసినదిగా ప్రభుత్వం, కేశియాంగశాఖ కార్యదర్శిని కోరింది.

### కేరళ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్‌పై చర్య

తిరువేంద్రం, జూలై 3: ఒకరోడ్డు నిర్మాణం విషయంలోవచ్చిన ఫిర్యాదులపై కేరళప్రభుత్వం, ఒకఎగ్జిక్యూటివ్ ఇంజనీరుతోపాటు మరోముగురు ఉద్యోగులను తాత్కాలికంగా తొలగించింది. న్యాయవిచారణ తరువాత జరుగుతుంది.

ఈరస్తానిర్మాణంలో, ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, అసిస్టెంటు ఇంజనీరు, సూపర్వైజరు, వర్క్స్ సూపరింటెండెంట్లు, తీవ్రమైన అవకతవకలు జరిపారని, ప్రాథమిక పరిశీలనలో తేలినట్లు ప్రభుత్వం ప్రకటించింది.

## పంత్ ఇంటివద్ద వర్తకుల ప్రదర్శన

### లాఠీ ప్రయోగాలు. ఆరుగురికి గాయాలు

న్యూఢిల్లీ, జూలై 3: అంతరరాష్ట్రీయ అమ్మకం పన్ను ఢిల్లీనుండి జరిగే ఎగుమతులకు చట్టం వర్తింపచేయరాదని నినాదాలుచేస్తూ సుమారు వేయిమంది ఢిల్లీ వర్తకులు దేశీయాంగశాఖామంత్రి శ్రీ పంత్ ఇంటి ముందు ప్రదర్శనలు చేశారు. ఈసమయంలో పోలీసులు లాఠీలను, బాష్పవాయువును ప్రయోగించిన ఫలితంగా ఆరుగురు గాయపడ్డారు.

ఢిల్లీ నుండి జరిగే ఎగుమతులకు అంతర రాష్ట్రీయ అమ్మకం పన్ను శాసనాన్ని వర్తింపచేయరాదని నినాదాలు చేస్తూ, సుమారు వేయిమంది ఢిల్లీ వర్తకులు ఈ కోట ఉదయం ఊరేగింపుగా బయలు దేరారు. ప్రదర్శకులు శ్రీ పంత్ గృహం చేరగానే, ఆయనను చూచి, తమ కోర్కెలను వివరించాలని భావించారు. శ్రీ పంత్ గృహంలోనికి బలవంతంగా ప్రవేశించాలని వీరు ప్రయత్నించారని పోలీసులు అంటున్నారు.

ఈ సమయంలో పోలీసులు లాఠీలను, బాష్పవాయువును ప్రయోగించారు. దీని ఫలితంగా ప్రదర్శకులలో ఆరుగురు గాయపడ్డారు. గాయపడినవారిని ఆసుపత్రిలో చేర్చారు. మొదట్లో ప్రదర్శకులను కదలిపొమ్మని పోలీసులు కోరారట. కాని వారు అందుకు అంగీకరించకుండా, మంత్రి గృహంలోనికి వెళ్లాలని పట్టుపట్టారట.

ఒక గంట అనంతరం ప్రదర్శకుల ప్రతినిధులు కొంతమంది శ్రీ పంత్ ను కలిసికొని, తమ కోర్కెలను వివరించారు. ఢిల్లీ ఎగుమతులపై అంతర రాష్ట్రీయ అమ్మకం పన్నును విధించడంవల్ల, ఇక్కడి వ్యాపారం అంతా నాశనమై పోతుందనీ, ఆర్థిక వ్యవస్థ ఘోరంగా దెబ్బతింటుందనీ వీరు తెలిపారు. వీరు మంత్రికి తమ నివేదిక ప్రతిని కూడా సమర్పించారు. ఈ విషయాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తానని శ్రీ పంత్ మాట ఇచ్చారని తెలుస్తోంది.

ఈ ప్రదర్శనను ఢిల్లీ వ్యాపార సంస్థల సమాఖ్య కార్యాచరణ సంఘం ప్రారంభించింది. ఇకముందు తీసికో వలసిన చర్యను గురించి చర్చించేందుకు కార్యాచరణ సంఘం నేడు సమావేశం కానుంది.

## నాగపూర్‌లో కార్మికులపై పోలీసుల కాల్పులు

నాగపూర్, జూలై 3: ఇక్కడకు 35 మైళ్ళ దూరంలోని ఆమగాన్‌లోని ఒక బీడీ కర్మాగారంలో పనిచేసే కార్మికులు ప్రదర్శన చేసినందువల్ల పోలీసులు కాల్పులు జరిపారు. ఈ సంఘటన ఈనెల మొదటి తేదీన జరిగింది. ఈ కార్మికులు పోలీసులపై రాళ్ళు రువ్వినందువల్ల, కాల్పులు జరిపినట్లు తెలిసింది. ఒక కార్మికుడు తుపాకిగుండువల్ల గాయపడ్డాడు. కొంత మంది పోలీసులతో సహా పన్నెండు మందికి దెబ్బలు తగిలాయి. తొమ్మిదిమంది కార్మికులను పోలీసులు అరెస్టు చేశారు. జూన్ 26 నుండి 30 వరకూ కార్మికుల మస్టర్‌పని పంపిణీ విషయమై ఒక బీడీ కర్మాగారాన్ని యజమానులు మూసివేశారు. జూలై 1 న కార్మికులు యజమానులవద్దకు వెళ్లి, కర్మాగారాన్ని తెరవమన్నారు. కాని యజమానులు అంగీకరించలేదు. అంత కార్మికులు రాళ్లు రువ్వడం ప్రారంభించగా పోలీసులు 3 సార్లు కాల్పులు జరిపారు.

## తక్కువ తరగతి ఉద్యోగులకు గృహనిర్మాణ పథకాలు

### ప్రణాళికలోని వాటిని కొనసాగించాలని రాష్ట్రాలకు కృష్ణమాచారి ఆదేశం

న్యూఢిల్లీ, జూలై 3: కేంద్ర ఆర్థికశాఖ ఆమోదంకోసం చూడకుండా, ప్రణాళికలోని తక్కువ తరగతి ఉద్యోగుల గృహనిర్మాణ పథకాలను, మురికిపేటల అభివృద్ధి కార్యక్రమాలను కొనసాగించవలసిందని రాష్ట్రప్రభుత్వాలను కేంద్ర ఆర్థికమంత్రి శ్రీ కృష్ణమాచారి కోరారని తెలుస్తోంది.

ఈ రెండు రంగాలలోను రాష్ట్రప్రభుత్వాలు చేపట్టిన కార్యక్రమాలను కేంద్ర ఆర్థికశాఖ ఆమోదించవలసి ఉంది; పైగా కేంద్రం ఇచ్చే ధన సహాయం విషయం నిర్ణయం కావలసి ఉంది. ఐనా, వీటికోసం నిరీక్షించకుండా చేపట్టిన కార్యక్రమాలను కొనసాగించవలసి కేంద్ర ఆర్థికమంత్రి కోరారు. కేంద్ర సహాయాన్ని గురించిన వివరాలను తరువాత నిర్ణయించేస్తామని ఆయన సూచించారు.

ద్వితీయ ప్రణాళికలో తక్కువ తరగతి ఉద్యోగుల గృహనిర్మాణ పథకాలకు సబ్సిడీలు రూపాయలను, మురికిపేటల అభివృద్ధికి, పట్టణవసతుల గృహనిర్మాణానికి ఇరవై కోట్ల రూపాయలను కేటాయించారు. ఉద్యోగులకు 68 వేలు, పనివారికి 110 వేలు గృహాలను నిర్మించవలసింది.

ఈ పథకం ప్రకారం ఆరువేల రూపాయల సంవత్సరాదాయం మించని వారికి గృహనిర్మాణానికిగాను దీర్ఘకాల ఋణాలను ఇస్తారు. ఈ సొమ్మును రాష్ట్రాలకు కేంద్రం అప్పుగా ఇస్తుంది. దీనిపై నూటికి రు 3-4-0 వడ్డీ వసూలు చేస్తారు. దీనిని మూడు పంపకాలలో రాష్ట్రప్రభుత్వాలు చెల్లించాలి. కాని మధ్యతరగతి ప్రజలకు గృహనిర్మాణంకోసం సరియైనస్థలాలు లభ్యం కావటం అన్నది ఒకసమస్యగా ఉంది.

మురికిపేటల అభివృద్ధిలో నాలుగు వంతుల ఖర్చును కేంద్రం భరిస్తూ, సగం ఖర్చును ఋణంగా ఇస్తుంది. తక్కిన నాలుగోవంతు సొమ్మును ఆయా ప్రాంతాల ప్రజలనుండి రాష్ట్రాలు వసూలు చేస్తాయి. ఈ ఋణాన్ని 30 సంవత్సరాలలో చెల్లించాలి.

## భద్రతా మండలి సభ్యత్వం

### జపాన్‌కుబ్రిటన్‌అమెరికాల మద్దతు

న్యూయార్క్, జూలై 3: భద్రతా మండలిలో జపానుకు సభ్యత్వాన్ని ఇవ్వాలని బ్రిటన్, అమెరికాలు నిశ్చయించుకొన్నాయి. మండలి సభ్యత్వంకోసం జపాన్ అభ్యర్థిత్వాన్ని యీ రెండు రాజ్యాలు బలపరుస్తున్నాయంటే, జపాన్ ఎన్నిక దాదాపు ఖాయమే అని అభిజ్ఞ వర్గాలవారు చెప్పారు.

సెప్టెంబరు 17 న ఐక్యరాజ్య సమితి సర్వ సభ్య సమావేశంలో యీ సమస్య వస్తుంది. ఎన్నిక కైతే 1958 జనవరి 1 న జపాన్‌మండలి సభ్యత్వం స్వీకరిస్తుంది. అప్పటికి మండలిలోని క్యూబా, ఫిలిప్పీన్స్, ఆస్ట్రేలియా ఆవరణం చేస్తే తీరిపోతుంది.

## దక్షిణ ప్రాంతీయ మండలి సమావేశం

### జూలై 11 న మద్రాసులో

మద్రాసు, జూలై 3: దక్షిణ ప్రాంతీయమండలి ప్రథమసమావేశం మద్రాసులో జూలై 11 న తేదీ సాయంత్రం 4 గంటలకు జరుగుతుంది. కేంద్ర హోంశాఖ మంత్రి శ్రీ గోవిందవల్లభ పంత్ ప్రారంభోత్సవం జరుపుతారు, సభ్యరాజ్యాలైన మద్రాసు, ఆంధ్ర, కేరళ ప్రతినిధులు ఈచర్చలకు హాజరు అవుతారు.

ఈసమావేశంలో కావేరి భాషలు రాష్ట్రాలమధ్య నుంచి ముఖ్యంగా చర్చలు గాగవలసి తెలుస్తున్నది.

వీరికి కార్యాలయం శాశ్వతంగా ఉంటుంది.

# నగరంలో నిషేధపు ఉత్తర్వు

## మరో రెండువారాలపాటు పొడిగింపు

మదరాసు, జులై 2 : నగరహద్దుల్లో అనుమతిలేకుండా ఊరేగింపులు, ప్రదర్శనాలను నిషేధిస్తూ మే 8 తేదీన పోలీసు కమిషనర్ జారీచేసిన నిషేధపు ఉత్తర్వును జులై 4 తేదీనుండి మరొక రెండువారాలపాటు పొడిగిస్తూ పోలీసు కమిషనర్ ఉత్తర్వు జారీచేశారు.

ద్రవిడకజగం నగర హలహోరాలశాల పేర్లనుండి బ్రాహ్మణ అనేమాటను తుడిచివేసే కార్యక్రమం ప్రారంభించినందున మొదట్లో ఈ నిషేధపు ఉత్తర్వును జారీచేశారు.

# నావికుల తర్ఫీదు

మద్రాసు, జులై 1 : విశాఖపట్నంలో ఉండే "మేఖల" అనే నావలో నావికుల శిక్షణకు అభ్యర్థులను మద్రాసులోని పాత హైకోర్టుభవనంలో నౌకా వాణిజ్యశాఖ ప్రధానోద్యోగి జులై 5 ఉదయం 10 గంటలకు ఎంచుకొంటారు.

ఈవిధంగా ఎన్నికైన అభ్యర్థులకు నావ అంతర్భాగంలోను ఇంజనులోను పనిచేస్తారు. శిక్షణ కాలంలో బస భోజన ఏర్పాట్లు ఉచితంగా చేస్తారు. అభ్యర్థులు బాగా దృఢకాయులుగా ఉండాలి. నావికావృత్తిలో ఉండే కుటుంబాలకు చెంది హిందీ లిఙ్గ్లము తెలిసే బాలురకు అభ్యర్థులను ఎంచటంలో ప్రాధాన్యం యివ్వబడుతుంది. అభ్యర్థులు తమ అనుభవాన్ని వయస్సును నిరూపించే పత్రాలను ముఖాముఖి పరీక్షాసమయంలో హాజరుచేయాలి.

నౌకాశిక్షణ నావల రాక

మద్రాసు, జులై 2 : 12వ ఫ్రిగేట్ శిక్షణదళానికి చెందిన ఐ. యన్. యస్. కృష్ణా, కావేరి నావలు నౌకావిన్యాస సందర్భంగా యీవాళ మద్రాసు రేవుకు వచ్చాయి! కమాండర్ వి. జే. ఏ. కల్లాడెరిన్ యీ నావలకు తాత్కాలికంగా అధిపత్యాన్ని వహిస్తున్నారు. ఈ నావలుమద్రాసులో నాలుగోజులు ఉండి జులై 5 వ తేదీ పోర్టుబ్లేర్ వెళ్తాయి.



# దక్షిణ రాష్ట్రాలకు ఆహారమండలం

## కేరళమంత్రి ప్రతిపాదన

హైదరాబాదు, జులై 2 : ఆంధ్రప్రదేశ్, మదరాసు, మైసూరు, కేరళ రాష్ట్రాలు నాలుగింటికీ కలిపి ఒక ఆహారమండలాన్ని ఏర్పాటుచేయాలని కేరళ రాష్ట్రం ఆహారశాఖమంత్రి శ్రీ కె. సి. జార్జి ఇవాళ్ల ఇక్కడ చెప్పారు.

శ్రీ జార్జి ఇంకా ఇట్లా చెప్పారు: "కేరళరాష్ట్రానికి సాలుకు 7 లక్షల టన్నుల ఆహారధాన్యాలు ఇతరరాష్ట్రాల నుంచి సప్లయి కావలసి ఉంటుంది; వీటిలో ఎక్కువభాగం ఆంధ్రనుంచే సప్లయి అవుతున్నవి. ఆహారధాన్యాలకు సంబంధించినంత వరకూ మదరాసు రాష్ట్రం దాదాపు స్వయంసమృద్ధమైన రాష్ట్రమే. మైసూరుకు ఇతర రాష్ట్రాల నుంచి 50 వేల టన్నుల ఆహారధాన్యాలు సప్లయి కావాలి. ఈ వివరాలవల్ల దక్షిణాపథంలోని నాలుగు రాష్ట్రాలలో పండే మొత్తం ఆహారధాన్యాలు ఈ రాష్ట్రాలకు బొటాబొటీగా సరిపోతవని విశదమవుతుంది."

"దక్షిణ భారతంలోని రాష్ట్రాల కోసమని ఏర్పాటు చేయదలచిన ఆహారమండలంనుంచి కేరళను మినహాయించే ఆలోచనకు నేను వ్యతిరేకిని. దక్షిణ ఆహారమండలంలో కేరళను చేర్చాలనే ప్రతిపాదనను ఆంధ్రప్రదేశ్ అంగీకరిస్తుందని అనుకుంటున్నాను. ఆంధ్రప్రదేశ్ నుంచి కేరళకు చాలా ఉప్పుడు బియ్యం ఎగుమతి అవుతున్నవి. దక్షిణ ఆహారమండలంలో కేరళను కలపడని మదరాసురాష్ట్ర ప్రభుత్వం అనటం ఏమంత సమంజసంగా లేదు. ఆర్థికంగానూ, రాజకీయంగానూ దక్షిణ భారతంలోని నాలుగు రాష్ట్రాలకూ చాలా పోలికలున్నవి. అటేవిధంగా ఈ నాలుగు రాష్ట్రాల ఆహారధాన్యాల సమస్య పరిష్కారానికి కూడా ఒకే ఒక రకం పద్ధతిని అవలంబించితే బాగుంటుంది"

ఆహారధాన్యాల సప్లయి సందర్భములో ఒక రాష్ట్ర ప్రభుత్వంతో మరొక రాష్ట్ర ప్రభుత్వం వ్యవహారం జరిపే పద్ధతే బాగుంటుందని ఒక ప్రశ్నకు శ్రీ జార్జి జవాబు చెప్పారు.

రేపు ఇక్కడ జరుగనున్న దక్షిణ భారతంలోని రాష్ట్ర ప్రభుత్వాల ఆహార శాఖల మంత్రుల సమావేశంలో పాల్గొనేందుకు శ్రీ జార్జి ఇవ్వాళ్ళ ఇక్కడికి వచ్చారు. కేంద్ర ప్రభుత్వ ఆహారశాఖమంత్రి శ్రీ అజిత్ ప్రసాద్ జైన్ కూడా ఈ సమావేశంలో పాల్గొంటారు.

# రైల్వేల నిర్వహణ సంస్థలో ప్రాతినిధ్యం

## గుంటూరుజిల్లా బియ్యపు మిల్లు యజమానులవినతి

తెనాలి, జులై 1: రైల్వేల నిర్వహణ సంస్థలో ఆంధ్రప్రదేశ్ బియ్యపు మిల్లుల యజమానుల సంఘానికి ప్రాతినిధ్యమివ్వాలని, ఆహార ధాన్యాలపై అన్నిరకముల పన్నులను రద్దుచేయాలనీ ప్రభుత్వాన్ని కోరుతూ జిల్లా బియ్యపు మిల్లుల యజమానుల మహాసభలో నిన్న తీర్మానించారు. శ్రీ తెల్లాకుల జాలయ్య శ్రేష్ఠి అధ్యక్షత వహించారు. సమావేశంలో జిల్లా సంఘాన్ని స్థాపించారు.

ప్రథమంలో శ్రీ సంకా వెంకటేశ్వర్లు సభోద్దేశాలు వివరించారు.

అధ్యక్షుడు మాట్లాడుతూ ప్రభుత్వం వర్తకులపట్ల స్నేహభావంతోవుండటం లేదని, పైగా హీనంగా చూస్తోందనీ అన్నారు. వర్తకులు నిజాయితీతో వ్యవహరిస్తూ ఐక్యతతో తమహక్కులు సాధించుకోవాలని కోరారు.

సంఘావశ్యకత గురించి శ్రీయుతులు కల్లూరు సాంబమూర్తి, ప్రతాప సత్యనారాయణ, కొత్తమాసు వీరభద్రయ్య, తాళ్లూరు కోటేశ్వరరావు, ఊదర లక్ష్మీనారాయణ, తాళ్లూరు గురుమూర్తి, ఆరవేటి రాములు ప్రసంగించారు.

సంఘకార్యవర్గం ఎన్నుకున్నారు. అధ్యక్షులు - శ్రీ కారంశెట్టి సాంబశివరావు, ఉపాధ్యక్షులు - శ్రీ తాళ్లూరి గురుమూర్తి, కార్యదర్శి - శ్రీ కొగంటి సూర్యప్రకాశరావు, సహాయ కార్యదర్శి - శ్రీ ప్రతాప సత్యనారాయణమూర్తి, కోశాధికారి - శ్రీ పుట్టగుంట వెంకటరత్నం, సభ్యులు 16 మంది.

కార్యస్థానం ఇక్కడ ఏర్పాటు చేశారు. శ్రీ వెంకటేశ్వర్లు వందనమర్పించారు. (స్వ. వి.)

### మద్రాసు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుని పదవి ఎన్నిక

మద్రాసు, జులై 2 : మద్రాసు విశ్వవిద్యాలయం రిజిస్ట్రారు ఒక ప్రకటనలో యిలా తెలుపుతున్నారు. ప్రస్తుతం విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా ఉన్న డా॥ ఏ. లక్ష్మణస్వామి మొదలియార్ పదవీకాలం రాబోవు ఆగస్టు 20 వ తేదీ ఉదయంతో అంతిమాతుంది.

మద్రాసు విశ్వవిద్యాలయ చట్టం సెక్షను 11 (11) అనుసరించి సెనేటు సభవారు యీ పదవికై సిఫార్సుచేసే ముగ్గురు అభ్యర్థులనుంచి ఛాన్సలరు ఒకరిని ఉపాధ్యక్షునిగా నియమిస్తారు. ఈ ముగ్గురు అభ్యర్థుల పేర్లను సూచించటానికి ఎన్నిక జరుగుతుంది. ఇందుకు నామినేషను పత్రాలు, మద్రాసు విశ్వవిద్యాలయం రిజిస్ట్రారుకు జులై 12 వ తేదీ సా 4 గంటలలోపుగా అందజేయాలి.

# విదేశాలలో భారత నౌకాదళ ప్రతిష్ఠ

## రఘురామయ్య వివరణ

విశాఖపటణం, జులై 1: భారతనౌకాదళంగూర్చి, అది నిర్వహిస్తున్న కార్యక్రమాలను గూర్చి విదేశాలనుంచి ప్రభుత్వానికి సంతృప్తికరమైన వార్తలందుతున్నాయనీ, ఇక్కడనుంచి విదేశాలలో పర్యటించటానికి వెళ్లే నౌకాదళాధికారులు మనదేశం తరపున అనధికార రాయబారుల వంటివారనీ రక్షణశాఖ ఉపమంత్రి శ్రీ కొత్త రఘురామయ్య ఈ వేళ ఉదయం నౌకాదళ శిక్షణ కేంద్రంలో ప్రసంగిస్తూ అన్నారు.

ఉపమంత్రి నిన్న ఉదయం విమానం మీద గన్నవరంనుంచి ఇక్కడకు వచ్చారు. విమానాశ్రయంలో ఆయనకు నౌకాదళ అధికారి కెప్టెన్ ఆర్. ఎస్. డేవిడ్, జిల్లా కలెక్టరు శ్రీ ఎస్. జె. కామత్, పోలీసు డిప్యూటీ ఇన్స్పెక్టర్ జనరల్ శ్రీ వి. రంగస్వామి అయ్యంగార్, మేజర్ శార్దూల్ సింగ్ ప్రభృతులు స్వాగతం చెప్పారు. నౌకాబల శిక్షణాలయం శిక్షితులు ఆయనకు సైనిక వందనం సమర్పించారు.

శ్రీ రఘురామయ్య నిన్న సాయంత్రం సముద్ర తీరంలోని శిథిల్న దశాన్ని సందర్శించారు. పురపాలక సంఘ కమీషనర్ శ్రీ రామకృష్ణయ్య చౌదరి, డాక్టరు ఎం. వి. కృష్ణరావు ఆయనను కలుసుకుని శిథిల్న దశాన్ని ఏర్పాటు చేసిన ప్రదేశంగుండా లోగడ వేసిన రోడ్డును ఇప్పుడు మూసివేసినందున మరొకరోడ్డు ప్రత్యామ్నాయంగా నిర్మించవలసి ఉన్నదనీ, అయితే ఈ కార్యక్రమానికి ప్రభుత్వం చాలాధనం వ్యయపరచాలనీ తెల్పారు. ఉపమంత్రి రోడ్డు విషయమై ఆలోచించగలమన్నారు.

తరువాత శ్రీ రఘురామయ్య గౌరవార్థం ఆంధ్ర విశ్వవిద్యాలయం అధ్యాపక మండలి క్లబ్బు తేనీటవిందు ఏర్పాటుచేసింది. విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుడు డా॥ వి. ఎస్. కృష్ణ మాట్లాడుతూ తమ పట్టభద్రులను పెట్టటంలో శిక్షణ గరిపేందుకు ప్రభుత్వం లోగడ వాల్తేరులో ఒక శిక్షణాలయాన్ని ఏర్పాటు చేయదలచిందనీ, అయితే అందుకు విశ్వవిద్యాలయం సిండికేట్ సుముఖంగా లేనందువల్ల ఆ పని జరగలేదనీ, "లాసన్ బే" ప్రాంతంలో నౌకాబల శిక్షణ కళాశాలను నెలకొల్పటం కూడా కొన్ని కారణాలవల్ల సాధ్యం కాలేదని వివరించారు.

అనంతరం శ్రీ రఘురామయ్య "ప్రముఖ మతాల పరిశోధనా మండలి" సమావేశంలో పాల్గొన్నారు. విశ్వవిద్యాలయం కళాశాలల ప్రధానాధ్యాపకుడు డా॥ కె. రంగధామరావు ఆయనకు స్వాగతం చెప్పారు. ఉప మంత్రి తమ ప్రసంగంలో మత ప్రాముఖ్యాన్ని వివరించి, మతం తెలిపే సత్యాలను పదార్థ విజ్ఞానశాస్త్రం త్రోసిపుచ్చలేదనీ, ఐహికంగా ఎంతో అభివృద్ధిని సాధించిన దేశాల ప్రజలు సైతం ఇప్పుడు మతంవైపు మొగ్గు చూస్తున్నారనీ చెప్పారు. శ్రీ కె. రామకృష్ణరావు "ప్రముఖ మతాల పరిశోధనా మండలి" విశ్వవిద్యాలయంలో ఏర్పాటు చేసిన పరిస్థితులను తెల్పారు.

డాక్టరు రంగధామరావు వందన సమర్పణం చేశారు. (స్వ. వి.)

## విజయవాడలో స్వాగతం

విజయవాడ, జూన్ 30: భారత రక్షణశాఖ ఉపమంత్రి శ్రీ కొత్త రఘురామయ్య 28వ తేదీన గుంటూరు నుంచి ఇక్కడకు వచ్చారు. శ్రీయుతులు కాకాని వెంకటరత్నం, పేట బాపయ్య ప్రభృతులు ఆయనకు స్వాగతమిచ్చారు. ప్రభుత్వ అతిథి గృహంలోకి రాగానే పలువురు ప్రముఖులు పూలమాలలు వేశారు.

సాయంత్రం గుణదలలో డా॥ కె. మధుసూదనరావు ఉపమంత్రి గౌరవార్థం అల్పాహారవిందు ఏర్పాటు చేశారు. పలువురు ప్రముఖులు ఉద్యోగులు విందులో పాల్గొన్నారు. విందుకు పూర్వం ఆంధ్ర చేనేత సహకార సంఘం, దక్షిణ భారత సంఘం విడివిడిగా శ్రీ రఘురామయ్యకు సన్మాన పత్రాలు సమర్పించాయి. చేనేత సహకార సంఘ కార్యాలయంలో ఆయనకు శ్రీయుతులు ఇనుమర్తి వీరభద్రరావు, దామర్ల రమాకాంతరావు, కాశీనబసవరాజు స్వాగతమిచ్చారు. దక్షిణ భారత సంఘ కార్యాలయంలో ఉపమంత్రికి సంస్థ కార్యదర్శి శ్రీ శివరామయ్య స్వాగతపత్రం సమర్పించారు. శ్రీ రఘురామయ్య రక్షణశాఖ కృషిని వివరించారు. శ్రీ ఎ. రామనాథం చౌదరి వందన సమర్పణం చేశారు.

తరువాత తపాలా శాఖ ఉద్యోగుల సంఘం శ్రీ కాకాని వెంకటరత్నం అధ్యక్షతను శ్రీ రఘురామయ్యను అభినందించేందుకు ఒకసభ ఏర్పాటు చేసింది. రాత్రి జిల్లా కాంగ్రెసు సంఘం విందు ఇచ్చింది. పలువురు ప్రముఖ కాంగ్రెసువాదులు, వర్తకులు, న్యాయవాదులు, డాక్టర్లు విందుకు హాజరై శ్రీ రఘురామయ్యకు పూలమాలలు వేశారు.

29 వ తేదీన ఉపమంత్రి ఏలూరు వెళ్ళి రాత్రికి ఇక్కడకు తిరిగివచ్చారు.

30 వ తేదీన ఉదయం 9 గంటలకు ఆయన గన్నవరం విమానాశ్రయం నుంచి విమానంలో బయలుదేరి విశాఖపట్టణం వెళ్ళారు. శ్రీయుతులు కాకాని వెంకటరత్నం, పేటబాపయ్య, ఎం. సీతారామారావు, ఎం. శ్రీరామమూర్తి, ఆర్. బుచ్చి రామశేషయ్య, ప్రభృతులు ఆయనకు వీడ్కోలు చెప్పారు.

# నరసాపురంలో కళాశాల మూసివేత

## శీతజ్వరం వ్యాప్తి

నరసాపురం, జులై 1 : శీతజ్వరం వ్యాపిస్తూ ఉన్న కారణంచేత ఇక్కడి కళాశాల ఈ నెల 8వ తేదీవరకు మూసివేయడానికి అధికారులు నిశ్చయించారు.

విద్యార్థులలో దాదాపు 250మందికి ఈ వ్యాధి సోకినదని, వారు పాఠశాలకు హాజరు కావటం లేదని తెలియపరచుతూ, పాఠశాల మూసివేయడానికి అనుమతించవలెనని కేలర్ ఉన్నత పాఠశాల పాలక వర్గం అధికారులను అభ్యర్థించారు. స్వ. వి.

## ఇచ్ఛాపురం

ఇచ్ఛాపురంలో శీతజ్వరం ఇంతవరకు దాదాపు 700మందికి వచ్చినది. జిల్లాకలెక్టరు ఉత్తర్వుల ననుసరించి ఇక్కడి సినిమాహాల్సులో రోజుకు ఒక ప్రదర్శనం మాత్రమే జరుగుతున్నది. ఆ రోజు కారోజు శీతజ్వరం అధికంగా వ్యాపిస్తున్నది. ప్రభుత్వ ఆస్పత్రిలో తగువైద్య సహాయం లభించడం లేదు.

## చిత్తూరు

చిత్తూరు పట్టణంలో శీతజ్వరం క్రిందటి ఆయిదు రోజులుగా తగ్గుముఖం పట్టినది. పాఠశాలలు త్వరలోనే తెరవటం జరుగవచ్చు. స్వ. వి.

## పల్నాడులో బాలుని మృతి

గుంటూరుజిల్లా ఎగువ పల్నాడులో శీతజ్వరం విశేషంగా వ్యాపించినది. ముఖ్యంగా మాచెర్ల, వెలుదుర్తి, ఓబులేశునిపల్లె గ్రామాలలో ఈవ్యాధి తీవ్రరూపం దాల్చినది. ఓబులేశుని పల్లెలో శీతజ్వరం వల్ల 12 సంవత్సరాలవయసు కలిగిన బాలుడు మరణించాడు. ఇంతవరకు ఆరోగ్య శాఖాధికారులు ఎట్టిచర్యలు జరపలేదు.

దిగువ పల్నాడులో రెంట చింతల గ్రామంలో కూడా ఈవ్యాధి తీవ్రంగా ఉన్నది. అక్కడి ఉన్నత పాఠశాలను మూసివేయడం జరిగినది.

## గుంటూరులో మందుల కొరత

గుంటూరు, జులై 2: గుంటూరులో శీతజ్వరం తగ్గుముఖం పట్టిన సూచనలు ఉన్నది. అయినా నేటికి ఇంకా 4000 మందివరకు ఈవ్యాధికి చికిత్స పొందుతున్నారని తెలుస్తున్నది.

శీతజ్వరానికి ఉపయోగించే మందుల కొరత ఏర్పడినదని పురపాలక సంఘ ఆరోగ్యశాఖాధికారి డాక్టర్ వి. వి. గోపాలరావు చెప్పారు. ప్రభుత్వం త్వరలోనే మందులు సరఫరా చేయనున్నదని కూడా ఆయన చెప్పారు. మందులు లేక ప్రజలు ఇబ్బంది పడుతున్నారు. (స్వ. వి.)

## అనకాపల్లి

అనకాపల్లిలో శీతజ్వరం విశేషంగా వ్యాపించినది. పురపాలక సంఘ అధికారులు ఉన్నత పాఠశాలభవనం తాత్కాలికంగా ఆస్పత్రిగా మార్చి శీతజ్వరం వచ్చినవారిని ప్రత్యేకంగా ఉంచి చికిత్స చేయడానికి ఏర్పాట్లు చేశారు. (స్వ. వి.)

# శీతజ్వరం టీకాల మందు తయారీ

## బొంబాయిసంస్థచే క్రిముల వేరివేత

బొంబాయి, జులై 2: ఇక్కడి హాఫ్కిన్ ఔషధ పరిశోధక సంస్థ, శీతజ్వరానికి కారణమైన క్రిములను వేరుచేసింది.

ఇకమీదట యీ జ్వరాన్ని నిరోధించే టీకాలమందును గూడా యీ సంస్థ తయారుచేయవచ్చునని తెలుస్తున్నది. ఈ టీకాలమందు తయారీ విషయమై కేంద్ర ఆరోగ్యశాఖ డైరెక్టర్ జనరల్ తో సంప్రతించేందుకుగాను, హాఫ్కిన్ సంస్థ డైరెక్టరు ఢిల్లీ వెళ్తున్నారు.

ఈ క్రిములు, సింగపూర్ లో జ్వరానికి కారణమైన క్రిమి ఒకటేనని తేలింది.

క్రిముల వేరివేతకు బొంబాయి ప్రభుత్వం ప్రత్యేక సిబ్బందిని నియమించింది.

## శ్రీపి. వెదపరదేశినాయుడు మృతి

అనకాపల్లి, జూన్ 30: అనకాపల్లి రైతునాయకుడు శ్రీ విల్లా పెదపరదేశి నాయుడు ఈ నెల 27వ తేదీని హృద్రోగంవల్ల ఆకస్మికంగా మృతి చెందారు.

కిసాన్ సంఘ యాజమాన్యన జైహింద్ సినిమాహాలులో జరిగిన సభలో శ్రీ పెదపరదేశి నాయుడు మృతికి సంతాపం వెలిబుచ్చుతూ శాసనసభ్యుడు శ్రీ గొర్లు లచ్చన్న ప్రసంగించారు. వారు రైతులకు ప్రజానీకానికి చేసిన సేవను శ్రీ లచ్చన్న కొనియాడారు. సంతాపసభకు శాసనసభ్యుడు శ్రీ బీశెట్టి అప్పారావు అధ్యక్షత వహించారు. (స్వ. వి.)

మద్రాసు పత్రికా రచయితల సంఘ కార్యాలయంలో కీ॥ శే॥ శ్రీ ప్రకాశం చిత్రపటాన్ని శ్రీ సంజీవరెడ్డి ఆవిష్కరించారు. ఎడమవైపున మద్రాసు మంత్రి శ్రీ కక్కన్, కుడిప్రక్కన మేయరు శ్రీ శ్రీనివాసన్.

# స్వాతంత్ర్యోద్యమ వీరుడు ప్రకాశం

## సంజీవరెడ్డిచే చిత్రపట ఆవిష్కరణ

మద్రాసు, జులై 2 : ఆంధ్ర కేసరి శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులు దేశ స్వాతంత్ర్య పోరాటంలో విశేషంగా తోడ్పడిన జాతీయవీరులని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి వర్ణించారు.

శ్రీ సంజీవరెడ్డి నిన్న సాయంత్రం దక్షిణ భారత పత్రికా రచయితల సమాఖ్య భవనంలో శ్రీ ప్రకాశం చిత్రపటాన్ని ఆవిష్కరిస్తూ పైవిధంగా ఉన్నారు. ఈ సభకు మద్రాసుమంత్రి శ్రీ పి. కక్కన్, మేయరు శ్రీ కే. యస్. శ్రీనివాసన్, ప్రభృతులుకూడా హాజరైనారు.

సంఘాధ్యక్షుడు శ్రీ యస్. పి. గోవిందరాజన్ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రికి స్వాగతం తెలుపుతూ కీ॥ శే॥ ప్రకాశం దేశీయ నాయకుడేకాకుండా గొప్ప ముఖ్యమంత్రిగాను గొప్పపత్రికా రచయిత సంపాదకులుగా కూడా పనిచేశారని అన్నారు. పత్రికా నిర్వహణ చాలా కష్టంగా ఉన్నరోజుల్లో శ్రీ ప్రకాశం కొంతిమంది ఉత్సాహపరులైన యువకులను చేరదీసి తమ స్వరాజ్య పత్రిక ద్వారా దేశంలో పత్రికా రచనాభివృద్ధికి ఆయన చేయూతయిచ్చారని అన్నారు.

శ్రీ ప్రకాశం చిత్రపటాన్ని శ్రీ ఆర్. కృష్ణన్ సంఘానికి బహూకరించినందుకు వారికి ఆయన కృతజ్ఞతను తెలియజేశారు.

శ్రీ నీలం సంజీవరెడ్డి, పటాన్ని ఆవిష్కరిస్తూ శ్రీ ప్రకాశంవంటి మహానాయకుని చిత్రపటాన్ని ఆవిష్కరించే భాగ్యము తమకుకలగడం గొప్పగౌరవంగా భావిస్తున్నామన్నారు. శ్రీ సంజీవరెడ్డి యీ సందర్భమున యింకా యిలా చెప్పారు:

"నావిద్యార్థి రోజుల్లో నుంచి దాదాపు 25 యేళ్లుగా శ్రీ ప్రకాశంతో నాకు పరిచయంకలిగి, ఆయన మద్రాసులో రివిన్యూమంత్రిగా ఉన్నపుడు నేను ఆంధ్ర కాంగ్రెస్ కార్యదర్శిగానుండడంవల్ల ఆయనతో పరిచయ సంబంధాలు మరింత సన్నిహితమైనవి. జాతీయోద్యమంలో శ్రీ ప్రకాశం గారితో కలిసి కారాగృహవాసం ఏర్పడింది. శ్రీ ప్రకాశం నేను కారాగృహంనుంచి విడుదలై నతరువాత మళ్ళీ నన్నుమాత్రం వెంటనే నిర్బంధించటం జరిగింది. ఆ శిక్షాకాలాన్ని గడిచి నేను తిరిగి కారాగృహంనుంచి విడుదలై వచ్చినపుడు నేను సామాన్య కాంగ్రెస్ సేవకుడైఉండినా శ్రీ ప్రకాశం గొప్పమనస్సుతో నాకు స్వాగతం యివ్వటానికి వచ్చారు. ఆ మహానాయకుడు అవిధంగా చిన్నవారిని ఆదరాభిమానాలతో ప్రోత్సహించేవారు. ప్రకాశం జీవితంలో ప్రతి అంకము జాతీయ జీవిత చరిత్ర అంటే అతిశయోక్తి కాజాలదు. శ్రీ ప్రకాశం తన జీవితంలో విశేష భాగం మద్రాసులోనే గడిపి జాతీయోద్యమంపట్ల ప్రజలకు ఆసక్తిని కలుగజేశారు. ఆయన సైమన్ బహిష్కరణ రోజుల్లోను ఉప్పు సత్యాగ్రహంలోను ప్రదర్శించిన ధైర్యసాహసాలు ప్రజలు ఎన్నటికి మరువలేరు."

శ్రీ ప్రకాశం కాంగ్రెస్ నుంచి రాజీనామా యివ్వవలసి వచ్చిన సందర్భాలను తెలిపి ఆయనను తిరిగి కాంగ్రెస్ లో చేర్చేటు చేయగల భాగ్యం తనకు చేకూరినదనీ, ఆంధ్రరాష్ట్ర ప్రథమ ముఖ్యమంత్రి పదవిని ఆయన అపుడు స్వీకరించారనీ శ్రీ రెడ్డిగారు అన్నారు. ఆంధ్ర మంత్రివర్గంలో శ్రీ ప్రకాశం సహచర్యుడుగా పనిచేయడం చాలా ఆనందకరమైన విషయం. శ్రీ ప్రకాశం ఔదార్యంతోను ధైర్యంతోను చిన్న చిన్న భూస్థితిపరులకు శిస్తు మినహాయింపును ప్రకటించారు. ఆలస్యాన్ని ఆచరణలో పెట్టగలశక్తి మాకు లేకపోయినందుకు చింతిస్తున్నాను. అట్టి సాహసమైన పనిని అమలుపరచడం ప్రకాశం వంటి ధైర్యశాలికే సాధ్యం.

శ్రీ ప్రకాశం మరణంవల్ల దేశ స్వాతంత్ర్యసిద్ధికి ముఖ్యకారకులలో నొకరిని దేశం కోల్పోయింది. అయితే ఆ మహానాయకుని జీవితాశయాలు ఆయన జీవితకాలంలోనే నెరవేరినవి. శ్రీ ప్రకాశం దేశ స్వాతంత్ర్యసిద్ధిని గాంచారు. ఆయన పోరాటం సాగించిన ఆంధ్ర రాష్ట్రాన్ని సాధించారు. తాను కలగన్న విశాలాంధ్రను కూడా చూచారు.

శ్రీ ప్రకాశం పత్రికా సంపాదకులు కూడా అయినందున ఆ ఆదర్శమూర్తి ఛాయాపటము పత్రికా రచయితల భవనమును అలంకరించడానికి తగియున్నదని శ్రీ సంజీవరెడ్డి అన్నారు.

సహాయ కార్యదర్శి శ్రీ యస్. రామనాథన్ ధన్యవాదాలు సమర్పించారు. కార్యదర్శి శ్రీ వి. గణపతి శ్రీ నీలం సంజీవరెడ్డికి శ్రీ ప్రకాశం ఛాయాచిత్రాలను మూడింటిని కానుకగా యిచ్చారు.

## కళింగపట్నం రేవు అభివృద్ధిపరచ విజ్ఞప్తి

కళింగపట్నం, జూన్ 30: మాజీరేవు పనివారు, పడవ కార్మికులు నేటిసాయంకాలం ఆంధ్ర మత్స్య పారిశ్రామిక సంఘాధ్యక్షుడు శ్రీ కొమర శంకర నారాయణ అధ్యక్షతను సమావేశమై, అతిప్రాచీనమైన ఈ రేవు శిథిలావస్థలో ఉన్నందుకు విచారం వెలిబుచ్చుతూ, దానిని అభివృద్ధిపరచడానికి ప్రభుత్వం సత్వరచర్యలు జరపాలని కోరుతూ తీర్మానించారు.

దాదాపు ఎనిమిదివేలమంది రేవు పనివారికి జీవనోపాధికలిగించే ఈ రేవు ఎగుమతి దిగుమతులులేక దారిద్ర్యానికి నిలయమైఉన్నదని రేవు అభివృద్ధిపరచి నిరుద్యోగం నిర్మూలించి రేవుపనివారికి తిరిగి జీవనోపాధి కల్పించాలని ఆ తీర్మానంలో సూచించడమైనది.

వంశధారానది వరదలవల్ల పంట భూములు, రేవు ప్రాంతము నీటిలో మునిగిపోయినందున విశేషమైన నష్టం సంభవించినదనిసూచిస్తూ, వరదలనుంచి పట్టణానికి శాశ్వతంగా రక్షణకల్పించడానికి ప్రభుత్వం తగుచర్యలు జరపాలని, పడవల మరమ్మత్తుకు ఆర్థికసహాయంచేయాలని కోరుతూ సమావేశంలో మరికొన్ని తీర్మానాలు చేయడమైనది.

## శంకరమఠం శృంగేరిమఠానిదికాదు

తిరుపతి, జులై 1: స్మార్థమండలి సమావేశం శంకరమఠంలో శ్రీ టి. పి. వీరరాఘవశర్మ అధ్యక్షతన జరిగింది. శ్రీ శృంగేరిమఠం ప్రతినిధి. శ్రీ సంపంగి రామయ్య వచ్చారు. తిరుపతిమఠంపై యాజమాన్యం విషయమై వీరు మైసూరు ప్రభుత్వానికి నివేదిక సమర్పించాలి.

ఈమఠం స్థానికుల విరాళాలతోనే నిర్మించారని శృంగేరిమఠంలో వుండిన శిష్యులలో ఒకరు యీమఠం నిర్వహణను ఒక స్థానికసంఘానికి వప్పగించారని శ్రీ వి. యస్. వెంకటనారాయణ తెలిపారు. శృంగేరిమఠానికి ఇది చెందదని మండలి అభిప్రాయం వివరించారు.

శృంగేరిమఠం ఆస్తిపాస్తుల జాబితాలో ఇది లేకపోయినా, దీనిలోని నామఫలకంపై "శ్రీ జగద్గురు శృంగేరి శంకరాచార్య" అని పేరు వుండటంవల్ల శృంగేరిమఠానికి చెందినదేనని అభిప్రాయపడవలసివచ్చిందని శ్రీ సంపంగి రామయ్య చెప్పినట్లు తెలిసింది. ఏమయినా మైసూరు ప్రభుత్వానికి తమ నివేదిక సమర్పిస్తామని తెలియజేశారట.

## యన్. సి. సి. కార్యస్థానం

జులై 1 నుంచి జాతీయ విద్యార్థి సైనికదళం (ఆంధ్ర శాఖ) రెండవ బెటాలియన్ ప్రధాన కార్యస్థానం తిరుపతిలో వుంటుంది. ఇంతవరకు అనంతపురంలో వుంటున్నది.

# దేశీయవైద్యవిధానాల పరిశోధన

## భారతప్రభుత్వ ఆశయం

న్యూఢిల్లీ, జులై 1: పాశ్చాత్య, దేశీయ వైద్య విధానాల మధ్య గల సంబంధం అధికం కావాలని, యిక్కడ జరుగుతున్న రాష్ట్ర ఆరోగ్య మంత్రుల సమావేశం అంగీకరించింది.

దేశీయ విధానాలలోని మంచిని స్వీకరించేందుకు చర్యలు జరగాలని గూడా రాష్ట్రమంత్రులు కోరారు.

దేశీయ వైద్య విధానాల విషయంలో భారత ప్రభుత్వ దృక్పథాన్ని విశదీకరిస్తూ, యీ విధానాలలో పరిశోధన జరగాలనీ, ముఖ్యంగా ప్రత్యేక ఔషధాలను పరిశీలించి, ఆయా వ్యాధుల నివారణకు ఇవి ఏవిధంగా పనిచేసేది నిర్ధారణ చేయాలనీ ప్రభుత్వ ప్రతినిధి ఒకరు తెలియజేశారు.

ఇంకా వైద్య కళాశాలల్లో సంవత్సరం పాడుగునా బోధన కేంద్రాలను నిర్వహించాలనీ, ఉభయ శాఖల్లోని (క్లినికల్-నాన్ క్లినికల్) ఆచార్యులకు ఒకే విధమైన జీతాలను నిర్ణయించాలని గూడా యీ సమావేశం ప్రభుత్వానికి సిఫార్సు చేసింది.

## బ్లాక్ అధికారుల గోష్ఠి

యమ్మిగనూరు, జులై 1 : నందవరం, ఆలూరు, పెద్దతుంబళం, కోసిగి, బ్లాక్ అధికారులు, అభివృద్ధిసంఘ సభ్యులు మొన్న గోష్ఠిజరిపారు. శ్రీ వై. పిచ్చిరెడ్డి ప్రారంభించారు. జిల్లా ప్రణాళికాధికారి శ్రీ బి. జె. దొరైరాజ్ అధ్యక్షత వహించారు. శ్రీ యం. సోమప్ప పతాకోత్సవం చేశారు.

నిన్న వినోద కాలక్షేపాలు జరిగాయి. శ్రీ పిచ్చిరెడ్డి బహుమతులు పంచారు. శ్రీ బి. గోవిందరెడ్డి వందన మర్పించారు.

# టాటా సంస్థ ఉక్కు ధరలు

## టన్నుకు రు. 12 పెంచటానికి ప్రభుత్వ ఆమోదం

న్యూఢిల్లీ, జులై 1 : 1955-56 లగాయతు 1959-60 వరకు టాటా సంస్థలు, భారత ఇనుము, ఉక్కు సంస్థనుంచి తీసుకునే అన్నితరగతుల ఉక్కుకు, ప్రభుత్వం చెల్లించే సగటు ధరను (రిటెంషన్) టన్నుకు 12 చొప్పున పెంచాలని ఎగుమతి దిగుమతుల సుంకాలసంస్థ(టారిఫ్ కమిషన్) సిఫార్సుచేసింది. భారత ప్రభుత్వం యీ సూచనను ఆమోదించింది.

1954-55 సంవత్సరానికి, భారత ఇనుము ఉక్కుసంస్థకు చెల్లించేధరలను టన్నుకు రూ. 12 వంతున, టాటా సంస్థలకు టన్నుకు రు. 14 చొప్పున పెంచాలన్న సిఫార్సును కూడా ప్రభుత్వం అంగీకరించిందని ఉక్కు, గనులు, ఇంధనాలశాఖ ప్రకటించింది.

1954-55 తరువాత ఉక్కు ఉత్పత్తి ధరలు పెరిగిపోయాయనీ, కాబట్టి ఉక్కు ధరలను పెంచాలనీ కోరుతూ, యీ రెండు సంస్థలు ప్రభుత్వానికి విన్నవించుకున్నాయి. ఈ విజ్ఞప్తిని పురస్కరించుకొని టారిఫ్ కమిషన్ పై సిఫార్సులను చేయటం జరిగింది.

## విజయనగరంలో వన మహోత్సవం

విజయనగరం, జులై 2: స్థానిక పురపాలక సంఘ యాజమాన్యన నేటి ఉదయం ప్రకాశం పార్కులో డిప్యూటీ కలెక్టరు శ్రీ వి. వీరభద్రరావు కొబ్బరిపిలక నాటి వనమహోత్సవానికి ప్రారంభోత్సవం జరిపారు.

తరువాత జిల్లా అటవీశాఖాధికారి శ్రీ పి. వి. రామన్, పురపాలక సంఘ ఆరోగ్యశాఖాధికారిణి డాక్టర్ శ్రీమతి వి. సీత, పురపాలక సంఘాధ్యక్షుడు శ్రీ ఎ. అప్పనదొర పార్కులో కొబ్బరి పిలకలు నాటారు.

శ్రీ అప్పన్నదొర అధికారుల గౌరవార్థం తేనీటవిందుచేశారు. (స్వ. వి.)

## తెనాలి పురపాలక సంఘ సమావేశం

తెనాలి, జులై 1 : పురపాలకసంఘ సమావేశం మొన్న శ్రీ నన్నపనేని వెంకట్రావు అధ్యక్షతను జరిగింది.

శ్రీ నరేంద్రదేవ్ కార్మికవాడలోని పాఠశాల పిల్లలకు పలకలు బలపాలు పంచిపెట్ట నిశ్చయించారు. గాంధీజీ జన్మదినం, వర్ధంతి రోజులలో జంతు వధశాలలను మూసివేయాలన్న ప్రభుత్వ ఉత్తర్వును ఆమోదించారు. ఆయుర్వేద ఆస్పత్రిలో శ్రీ మోటుపల్లి నరసింహారావును ప్రధాన వైద్యులుగ తిరిగి మరో మూడేళ్ళు కంట్రాక్టుపై నియమిస్తూ తీర్మానించారు. బాలికోన్నత పాఠశాలలో సంస్కృతం ప్రవేశపెట్టాలని నిర్ణయించారు. నావాబ్ పార్కులో పఠన మందిర నిర్మాణానికి తీర్మానించారు. (స్వ. వి.)

## గంటల పంచాంగం

శ్రీ హేవిళంబి సం॥ ఆషాఢ శు॥ సప్తమి 1957 సం॥ జూలై 4 గురువారం శు॥ సప్తమి 6-37 అష్టమి రా 4-49 హస్త రా 1-11 వర్జ్యం 10-19 ల 11-51 కు.
శు॥ నవమి జూలై 5 శుక్రవారం శు॥ నవమి రా 8-27 చిత్ర 24-32 వర్జ్యం 8-59 ల 10-32 కు.

ఆంధ్రపత్రిక

ఒరులే యవి యొనరించిన
నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మ పథముల కెల్లన్
(మహాభారతము)

హేవిళంబి సం॥ ఆషాఢ శు॥ సప్తమి
గురువారం

# ఆంధ్ర ప్రదేశ్ పారిశ్రామిక అభివృద్ధి

నీటిపారుదల ప్రాజెక్టులను ఎన్నింటిని నిర్మించినా, సాగుకు అనుకూలమైన ప్రతి అంగుళం భూమినీ సాగుచేసినా రాష్ట్ర ఆర్థికస్థితిలో చెప్పుకోతగ్గ మార్పుండదు. రాష్ట్రాదాయం కూడా చెప్పుకోతగినట్టుగా పెరగదు. వ్యవసాయం నిరుద్యోగ సమస్యను పరిష్కరించలేదు. వ్యవసాయదారులే సంవత్సరంలో ఇంచుమించు ఆరుమాసాలు పనిలేకుండా వుంటున్నారు. వీరికి ఉపవృత్తులు కల్పించాలని రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు చాలాకాలంగా ఆలోచిస్తున్నవి. ఇంతవరకూ ఒక ప్రణాళిక అంటూ ఏదీ సిద్ధంకాలేదు. రాష్ట్రంలో ఎంత ఎక్కువభూమి సాగుఅయినా ఆర్థికసమస్యలు ఏవీ పరిష్కారము కావు. ఇప్పటికే రాష్ట్ర వనరాలుపోను మిగులుపడివున్న ఆహార ధాన్యాల వినియోగం ఒక సమస్యగా పరిణమించింది. దేశంలోవున్న గిరాకీని వినియోగించుకొని రాష్ట్రప్రభుత్వం లాభంపొందడానికి అవకాశం లేకుండావున్నది. ఈ సమస్యలన్నీ రాష్ట్రంలో కొత్త పరిశ్రమలు ప్రారంభమైతేగాని పరిష్కారంకావు.

రాష్ట్ర పారిశ్రామిక అభివృద్ధికి కేంద్రప్రభుత్వంనుంచి ఇంతవరకూ చెప్పుకోతగ్గ సహాయము లభించలేదు. ఆంధ్ర వాణిజ్యమండలివారు వారి సన్మానపత్రంలో "ఆంధ్రకు రెండవప్రణాళికలో 174.5కోట్ల రూపాయలు కేటాయించారు. జనాభాను, విస్తీర్ణాన్ని బట్టి చూస్తే ఈ మొత్తం చాలా తక్కువ. అంతేగాదు. పారిశ్రామిక అభివృద్ధికి గల అవకాశాలు, అవసరాలు దృష్ట్యా కూడా ఆంధ్ర వాటా చాలా తక్కువగా వుంది" అని ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డికి విన్నవించారు. రాష్ట్ర పారిశ్రామికాభివృద్ధి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, ఆంధ్ర వాణిజ్య సంఘము సమష్టిగా కృషి చేయడంమీదనే ఆధారపడి వుంటుంది. రాష్ట్రంలో కొత్త పరిశ్రమలను స్థాపించడానికిగాని, వున్న పరిశ్రమలను వృద్ధిచేయడానికిగాని ఎవరు కృషిచేసినా, వారికి ప్రభుత్వం పూర్తిగా సహాయం చేయగలదని శ్రీ సంజీవరెడ్డిగారు హామీ ఇచ్చారు.

ఆంధ్రప్రదేశ్‌లో కేంద్ర ప్రభుత్వం ఎరువుల ఫాక్టరీని స్థాపించే అవకాశం లేదని ముఖ్యమంత్రి ప్రసంగంవల్ల స్పష్టమైనది. ఆంధ్రవర్తకులు, పారిశ్రామికులు ఈఫాక్టరీని స్థాపించడానికి కృషిచేయాలని శ్రీ సంజీవరెడ్డి విజ్ఞప్తిచేశారు. రాష్ట్రంలో ప్రస్తుతం రెండు లక్షల టన్నుల ఎరువు వాడకం అవుతున్నది. ప్రస్తుతం నిర్మాణంలోవున్న ప్రాజెక్టులు పూర్తిఅయితే ఎరువుల వినియోగం ఇంకా ఎక్కువ కావచ్చును. కనుక రాష్ట్రంలో ఎరువుల ఫాక్టరీ ఏర్పడితే అది జయప్రదంగా సాగుతుంది. అయితే ప్రారంభదశలో దేశంలో తయారయ్యే ఎరువుల ఖరీదుకంటె ఈ ఫాక్టరీలో తయారయ్యే ఎరువుల ఖరీదు కొంత ఎక్కువగా వుండవచ్చును. ఆ తేడావల్ల పారిశ్రామికులు నష్టపడకుండా అధమం అయిదు సంవత్సరాలపాటు అయినా రాష్ట్రప్రభుత్వం ప్రత్యేక రక్షణలను కల్పింపవలసి వుంటుంది.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పటికీ, అన్ని సౌకర్యాలూ గల రాజధానీనగరం వున్నప్పటికీ ఆంధ్ర వర్తక, పారిశ్రామిక లోకానికి చెన్నపట్టణమే రాజధానిగా వుంటున్నది. ఈ 'రాజధాని' మారితేగాని ఆంధ్రలో వర్తకం విస్తృతం గాదు. పరిశ్రమలు అభివృద్ధి కావు. ఆ మార్పుకు వీలైన పరిస్థితులను రాష్ట్ర ప్రభుత్వం కల్పించాలి.

## నిరాయుధ చర్చల్లో భారత్ పాల్గొనాలి

### రష్యా పట్టుదల

మాస్కో, జూలై 2: ఐక్యరాజ్యసమితి నిరాయుధీకరణ ఉపసంఘం చర్చలలో, భారతదేశం పాల్గొనాలని రష్యా పట్టుబట్టుతున్నట్లు సోవియట్ అధికార వార్తాసంస్థ టాస్ యివాళ ప్రకటించింది.

టాస్ ప్రకటనలో ఇలా ఉంది! "నిరాయుధసమస్యపై భారతప్రభుత్వం పంపిన ప్రతిపాదనలను వివరించేందుకు తమ ప్రతినిధిని ఉపసంఘ సమావేశానికి రానివ్వవలసిందిగా భారత ప్రభుత్వం కోరింది; గనుక ఆ కోర్కెను తృప్తిపరచాలని సోవియట్ ప్రతినిధి శ్రీ జోరిన్ ఇవాళ ఉపసంఘసమావేశంలో పట్టుబట్టారు."

"భారత ప్రధానమంత్రి ఇప్పుడిలాగు లండన్‌లో ఉన్నారు గాబట్టి భారత ప్రతినిధిఅభిప్రాయాలు తెలుసుకోవడం చాలా బాగుంటుందని ఇప్పుడది సాధ్యమేనని శ్రీ జోరిన్ అన్నారు.

పాశ్చాత్య రాజ్యాల వైఖరిచూస్తే, యీ ఉపసంఘంలో సభ్యత్వంలేని రాజ్యాల అభిప్రాయాలు తెలుసుకోవాలనే కోరిక వాటికి లేదని సోవియట్ రష్యా అనుకోవాల్సివస్తున్నది. ఇలాంటి వైఖరి ఉపసంఘంకృషికే దెబ్బ" అని జోరిన్ విమర్శించారు.

## పాక్‌విమాన ప్రమాదం

### 22 గురి మృతి

ఢాకా, జూలై 3: మొన్న ఉదయం చిట్టగాంగ్ నుంచి ఢాకాకు బయలుదేరి త్రోవలో మటుమాయమైన విమానం చార్ లక్కి అనేచోట కూలిపోయిందని, అందులోని 24 గురిలోనూ ఇద్దరు మినహా అందరూ చనిపోయి ఉండవచ్చని నౌఖాలీ జిల్లామేజిస్ట్రేటు వద్దనుంచి యిక్కడికి వార్త చేరింది.

ఈ 24 గురిలో 20 మంది ప్రయాణికులు, నలుగురు విమాన చోదకులు.

## కేరళలో రాష్ట్రపతి కార్యక్రమం

త్రివేండ్రం, జూలై 2: రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ ఆగస్టులో 4 రోజులు త్రివేండ్రంలో గడుపుతారు. రాష్ట్రపతి ప్రత్యేక రైల్లో ఆగస్టు 11 సాయంత్రానికి త్రివేండ్రం చేరి ఆగస్టు 15 తేదీ ఉదయం త్రివేండ్రంలో స్వతంత్ర దిన అభివందనాన్ని స్వీకరిస్తారు. ఆరోజునే ఉదయం 10 గంటలకు బయలుదేరుతారు.

## మద్రాసులో భారత ప్రభుత్వ ప్రచార శాఖ కొత్త అధికారి

మదరాసు, జూలై 3: భారతప్రభుత్వ సమాచార శాఖ మదరాసు విభాగంలో సమాచార ఉద్యోగిగా ఉన్న శ్రీ కే. కే. నాయర్, కలకత్తాకు బదిలీ అయినట్లున్నారనీ, ప్రణాళికల ప్రచార శాఖలో ఉండే శ్రీ పి. దక్షిణామూర్తి ఆయన స్థానే ప్రచార ఉద్యోగిగా ఉంటారనీ తెలుస్తున్నది.

# ఆసియా ఆఫ్రికాలకు సమితిలో తగినంత ప్రాతినిధ్యం ఉండాలి

## నెహ్రూ హితవు: త్వరపడి ప్రణాళిక సవరించరాదు

### అగ్రరాజ్యాలకు వీటో అధికారం ఉండాలని కామన్వెల్తు ప్రధానుల అభిప్రాయం

లండన్, జూలై 2: ఆసియా ఆఫ్రికా రాజ్యాలకు ఐక్యరాజ్యసమితిలో, ముఖ్యంగా సమితికి సంబంధించిన సంస్థలలో తగినంత ప్రాతినిధ్యం ఉండడం అవసరమని భారతప్రధాని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ, యివాళ కామన్వెల్తు ప్రధానుల సమావేశంలో చెప్పారు. కామన్వెల్తు ప్రధానులకు నచ్చచెప్పడానికి శ్రీ నెహ్రూ ఈ విషయంపై చాలాసేపు మాట్లాడారట.

సమితి ప్రణాళికను త్వరపడి సవరించడం కూడదని, సమితి బలహీనతకు కారణం నేటి ప్రపంచ రాజకీయాలే గాని ప్రణాళికలోపాలు కావని నెహ్రూ హెచ్చరించారట.

సమితి ప్రణాళికను సవరించేందుకు ప్రపంచరాజ్య సమావేశాన్ని 1959 దాకా యేర్పాటుచేయకూడదని, అప్పటికి వాతావరణం మరింత సానుకూలమై సమావేశం జయప్రదమవడానికి వీలుంటుందని కామన్వెల్తు ప్రధానులు అంగీకరించారు. భద్రతామండలిలో అగ్రరాజ్యాలు వీటో అధికారాన్ని అక్రమంగా వినియోగిస్తున్నా, సమితి ప్రణాళికను యేవిధంగా సవరించినప్పటికి, యీ వీటో అధికారం మాత్రం యిప్పటిలాగానే ఉండాలని, పలువురు ప్రధానమంత్రులు అన్నారట.

కామన్వెల్తు ప్రధానమంత్రులు యీ ఉదయం ప్రత్యేక సమావేశంలో ఐక్యరాజ్యసమితిని, సమితియెదుర్కొంటున్న సమస్యలను చర్చించారు. ఆస్ట్రేలియా ప్రధానమంత్రి శ్రీ మెంజీస్ సమితి ప్రణాళిక సవరణగురించి మాట్లాడుతూ, సూయజ్ సమస్యపై ఒకవిధంగాను, హంగరీ వ్యవహారంపై ఇంకోవిధంగా సమితి వ్యవహరించిందని, ఈ రెండు సమస్యలపైనా, భిన్నమైనధోరణి అవలంబించడంచూస్తే, సమితి ప్రణాళిక సవరించడం అవసరమని తోస్తున్నదని అన్నారు. హంగరీ విప్లవంపై సమితి ఉపసంఘం సమర్పించిన నివేదికను చర్చించడానికి, సాధ్యమైనంత త్వరలో, సమితి సర్వసభ్య సమావేశం జరపాలని, యీ నివేదికను చర్చించడానికి సెప్టెంబరులో మామూలుగా సమావేశం జరిగేవరకు ఆగరాదని, శ్రీ మెంజీస్ కోరారు. శ్రీ మెంజీస్ అభిప్రాయాన్ని బ్రిటన్ కూడా సమర్థించినట్లు తెలిసింది.

### పాకిస్తాన్ ప్రధాని గోడు

పాకిస్తాన్ ప్రధానమంత్రి శ్రీ సుహ్రావర్దీ కూడా, సమితి ప్రణాళిక గురించి దీర్ఘంగా మాట్లాడారు. ఐక్యరాజ్య పోలీసుబలాన్ని యేర్పాటుచేసే విషయం ప్రస్తావించారు. సమితి తీర్మానాలను ఏరాజ్యాలైనా తృణీకరిస్తే ఏం చేయాలి? చర్యతీసుకోవాలా, చేతులు ముడుచుకొని కూర్చోవాలా అని ఒక ప్రశ్న వేశారు. సమితి తీర్మానాలను ఉల్లంఘించే రాజ్యాలపై, ఆర్థిక ఆంక్షలను ప్రయోగించడం లేదా నైతిక సంబంధమైన చర్యలను తీసుకోవడం వాంఛనీయమేనా? అని ఆయన అన్నారు.

దక్షిణాఫ్రికా ప్రధానమంత్రి తరఫున వచ్చిన ఎరిక్ లో (విదేశాంగ మంత్రి) ఐక్యరాజ్యసమితి, ఎక్కడ దురాక్రమణ జరిగినా అణచివేయ గలిగినంత సమర్థంగా ఉండాలన్నారు. సమితి యేర్పాటుచేయడంలో అసలు ప్రధానమైన లక్ష్యం అదేనని, యిప్పటికీ అదేలక్ష్యంగా ఉండాలని ఆయన అన్నారు.

సమితితో దక్షిణాఫ్రికా సంబంధాలను గురించి శ్రీ లో ఏమీ మాట్లాడలేదు. ఆ విషయం ఆయన మాట్లాడదలచుకోలేదని, యీ సమావేశానికి ముందే తెలిసింది. దక్షిణాఫ్రికా భారతీయ సమస్యపైనా, జాతివిభేద విధానాలపైనా, సమితి తీర్మానాలు చేయడం తమ అంతరంగిక వ్యవహారాలలో కల్పించుకోడమేనని దక్షిణాఫ్రికా భావం. అందుచేత సమితితో సంబంధాలు ఆదేశానికి అంత బాగా లేవు.

### సమితి బలహీనతకు కారణం

ఆస్ట్రేలియా, సమితి ప్రణాళికను సవరించడం అవసరమన్నది. కాని భారత దేశము మరికొన్ని దేశాలు, సమితి బలహీనతకు నేటి ప్రపంచ రాజకీయాల ప్రభావమే కారణంగాని, సమితి ప్రణాళికలో లోపాలుకావు అని వాదించాయి.

మొత్తంమీద ప్రధానమంత్రులు, సమితి ప్రణాళిక సవరణకు, యిది సమయంకాదని, తరువాత చూచుకోవచ్చని అయితే యీలోగా, యిప్పటి ప్రణాళిక పరిధిలోనే, సమితి బాగా పనిచేయ గలిగేందుకు కృషి చేయాలని అంగీకరించారు.

సమితి గుణదోషాలను చర్చించి, యీ దోషాలకు ఎక్కువగా సభ్యత్వ రాజ్యాల చేతలే కారణంగాని, వ్యవస్థలో లోపంవల్ల కాదని స్థూలంగా అంగీకరించారు. ఈ నేరం ఏ ఒక్క రాజ్యంపైనా వేయలేదు. సమితిని బాగు చేయడానికి సర్వశక్తుల జరగాలని ఒప్పుకొన్నారు.

### బ్రిటన్ రక్షణ విధానం

#### తమతో ముడి ఉన్న ప్రధానులకు వివరణ

ఉత్తర అట్లాంటిక్, బాగ్దాద్, మనీలా రక్షణ కూటాల్లో చేరి తమతో ముడిపెట్టుకుని ఉన్న, ఎనిమిది మంది కామన్వెల్తు ప్రధానులకు బ్రిటిష్ సైనికాధిపతులు, అణ్వస్త్రాలు, ఉదజని బాంబు ఆధారంగా బ్రిటన్ రూపొందించుకొన్న నూతన రక్షణ విధానాన్ని ఇవాళ రహస్య సమావేశంలో వివరించారు. ప్రపంచ వ్యాప్తంగా పన్నిన రక్షణ వ్యూహాలేమిటో యీ ప్రధానమంత్రులు తెలుసుకొన్నారు.

భారత, సింహళ ప్రధానులు యీ సమావేశంలో పాల్గొనలేదు.

### ఆర్థిక వాణిజ్య సంస్థలు

ఆర్థిక వాణిజ్యాది సమస్యలపై రేపు ఎల్లుండి కామన్వెల్తు ప్రధానులు చర్చిస్తారు. శుక్రవారంనాడు వీరి సమావేశం ఆఖరవుతోంది.

అట్టావాలో, త్వరలో కామన్వెల్తు వాణిజ్యమహాసభ జరపాలని కెనడా ప్రధానమంత్రి డైఫన్‌బేకర్ యిదివరకే సూచించారు.

### నెహ్రూ సుహ్రవర్దీల సమావేశం

ఘనా ప్రధానమంత్రి శ్రీ క్వామె న్క్రుమా యీ మధ్యాహ్నం భారత ప్రధానమంత్రి శ్రీ నెహ్రూను కలుసుకొని అరగంటసేపు మాట్లాడారు.

శ్రీమతి విజయలక్ష్మి ఇంట్లో శ్రీ నెహ్రూ బసచేస్తున్నారు. అక్కడే శ్రీ నెహ్రూ శ్రీ సుహ్రవర్దీ సమావేశం జరిగింది. వీరు ఏమి చర్చించారో మాత్రం ఇంకా తెలియలేదు.

కామన్వెల్తు ప్రధానమంత్రుల సమావేశం ప్రారంభమవబోయేముందు బుధవారంనాడు శ్రీ నెహ్రూకు, శ్రీ సుహ్రవర్దీ విందు చేశారు. ఆ తరువాత ప్రధానమంత్రుల సమావేశాలలో కలుసుకొంటున్నారు. కాని మళ్ళీ విడిగా యీ యిద్దరు కలుసుకోడం ఇవాళే.

### నై దంపతులకు నెహ్రూ విందు

సర్ ఆర్చిబాల్డ్ నై దంపతులకు శ్రీ నెహ్రూ ఇవాళ విందు చేశారు.

సర్ నై ఇదివరలో మద్రాసురాష్ట్ర గవర్నరుగాను, భారతదేశంలో బ్రిటిష్ హైకమీషనరుగాను పనిచేశారు.

శ్రీ నెహ్రూ గౌరవార్థం శ్రీమతి విజయలక్ష్మి యీ సాయంత్రం విందు యేర్పాటు చేసింది. 400 మంది అతిథులు వచ్చారు. వారిలో బ్రిటిషు మంత్రులు, లండన్‌లోని విదేశీ రాయబారులు, పురప్రముఖులు, కొందరు భారతీయులు ఉన్నారు.

## జోర్డాన్‌కు అమెరికా ఆర్థిక సహాయం

### డల్లెస్ వివరణ

వాషింగ్టన్, జూలై 2: ఈజిప్టు, సిరియాలు, జోర్డాన్‌కు ఇస్తామని ఒప్పుకున్న డబ్బును, ఇవ్వక పోవడం వల్ల, అమెరికా, జోర్డాన్‌కు సహాయం చేస్తున్నదని అమెరికా విదేశాంగ మంత్రి శ్రీ డల్లెస్ నేడు వివరించారు.

అమెరికా ఇప్పుడు జోర్డాన్‌కు ఇస్తున్న డబ్బు, పూర్వం బ్రిటన్ ఇచ్చిన డబ్బు, మొత్తాలు, ఒకటిగానే వున్నందువల్ల, జోర్డాన్ విషయంలో పూర్వం బ్రిటన్ ఏ స్థానంలో వుందో ఆ స్థానంలో ఇప్పుడు అమెరికా ప్రవేశిస్తోందా అన్న అనుమానం కల్గి, విలేఖరులు, శ్రీ డల్లెస్‌ను, ఆ మాట కోస్తా అడిగి వేశారు.

"అటువంటి అర్థాలే ఇక్కడ చెప్పడానికివీల్లేదు. డబ్బుమొత్తంఒక్కటిగా వున్నదని దీనికి ఆ అర్థం పట్టదు" అని శ్రీ డల్లెస్ సమాధానం ఇచ్చారు.

జోర్డాన్‌కు ఇరుగుపొరుగు అరబ్ రాజ్యాలు సహాయం చేస్తే, అమెరికా కన్నా సంతోషించే దేశం ఇంకొకటి వుండదు అన్నారు శ్రీ డల్లెస్.

## కొరియా ఏకీకరణం

### అమెరికా విదేశాంగమంత్రి అభిప్రాయం

వాషింగ్టన్, జూలై 2: ఉత్తర దక్షిణ కొరియాలు రెండింటిలోను సమితి ఆధ్వర్యంలో స్వతంత్రమైన ఎన్నికలు జరపడానికి ఉత్తరకొరియా వారు, చైనా వారు, అంగీకరించినప్పుడే, కొరియా ఏకీకరణాన్నిగూర్చి మాట్లాడ్డం మంచిది గాని, ఆ అంగీకరించనంత వరకూ మాట్లాడ్డం మంచిదికాదని అమెరికా విదేశాంగమంత్రి శ్రీ డల్లెస్ నేడు ఇక్కడ వివరించారు.

కొరియా విషయంలో సమితి విధించిన షరతులను, చైనాగాని, ఉత్తర కొరియాగాని ఆమోదించే అవకాశం ఎక్కడా కన్పించడంలేదు. 1954 లో ఇండోచైనా సమాధానం కుదిరినప్పుడు ఈ షరతులను సమితి ప్రకటించింది. వాటిని కమ్యూనిస్టేతరదేశాలు ఆమోదించాయి అనికూడా శ్రీ డల్లెస్ ఈ సందర్భంలో చెప్పారు.

కొరియాలో స్వతంత్రమైన ఎన్నికలకు చైనా, ఉత్తరకొరియా అంగీకరించాయిగదా? అని ప్రశ్నించగా, "అంగీకరించాయి. నిజమే. కాని, ఆ దేశాలు పెట్టిన షరతులుగూడా అక్కడ కొన్ని వున్నాయి" అని శ్రీ డల్లెస్ సమాధానం ఇచ్చారు. వారి షరతులకు అంగీకరిస్తే, దక్షిణకొరియాలోగూడా కమ్యూనిస్టులకు స్థానంచిక్కి, ప్రభుత్వం కూలద్రోయగల బలం లభించివుండేది. అందుకే అమెరికా వారిమాటలను తిరస్కరించింది అనికూడా శ్రీ డల్లెస్ చెప్పారు.

# కొన్ని షరతులతో పాశ్చాత్యులచే అణ్వస్త్ర పరీక్షల తాత్కాలిక నిలుపుదల

## నిరాయుధీకరణ సంఘంలో ప్రతిపాదనలు

లండన్, జూలై 2: అణ్వస్త్రాల పరీక్షలను నిలుపుచెయ్యడానికి, పశ్చిమరాజ్యాలు, కొన్ని షరతులతో ఆమోదాన్ని చూపించి, అందుకుగాను, కొన్ని ప్రతిపాదనలను, నేడు సమితి నిరాయుధీకరణోప సంఘంలో ప్రతిపాదించారు.

ఈ ఉపసంఘంలోని నాలుగు పశ్చిమ రాజ్యాలు - బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సు, కెనడా—సమష్టిగా ప్రతిపాదనలను చేశాయి. బ్రిటిష్ విదేశాంగ మంత్రి శ్రీ లాయడ్, ఈ ప్రతిపాదనలను, ఈ ఉపసంఘం ముందుంచారు. అయితే ఇందులో ఈ పరీక్షలు ఎంతకాలం ఆపుచేసేది నిర్దిష్టం అయిలేదు.

అయితే అమెరికా ప్రతినిధి శ్రీ హెరాల్డ్ స్టాసెన్ మాట్లాడుతూ, ఈ పరీక్షలను 10 నెలలపాటు ఆపడానికి తమ ప్రభుత్వం అనుమతిస్తోందని చెప్పారు.

ఇప్పుడు ఈ రకమైన నిలుపుదలకు ఇటువంటి అవకాశం లభించడానికి, స్థల పరీక్షా కేంద్రాల సూత్రాన్ని, రష్యా ఆమోదించడం కారణం అని పశ్చిమ రాజ్యాల ప్రతిపాదనలలో వుంది. "ఈ పరీక్షా కార్యక్రమాన్ని నిపుణులు కలిసి ఆలోచించి నిర్ణయించాలి. పశ్చిమ రాజ్యాలు సూచించిన ప్రకారం మామూలు ఆయుధాలను తగ్గించుకోడానికికూడా రష్యా ఆమోదించి, అందుకు పూనుకున్న అనంతరమే, ఈ పరీక్షలను ఆపడాన్నిగూర్చి ఆలోచనలు జరగాలి" అనికూడా ఈ ప్రతిపాదనలలో వుంది.

వీటిని, నేటి ఈ ఉపసంఘం సమావేశంలో వివరిస్తూ, శ్రీ లాయడ్ ఇలా అన్నారు: "అణువ్యాన్ని సైనిక ప్రయోజనాలకోసం వినియోగించడంగూడా మానుకోవలసి వుంటుంది. ఆవిషయాన్నిగూర్చిగూడా సూత్రప్రాయంగా ఒప్పందం కుదరాలి, దీనికి, ఈ అణ్వస్త్ర పరీక్షల నిలుపుదలకుగూడా సంబంధం వుంది అని మేము భావిస్తున్నాము."

అయితే ఈ ప్రతిపాదనలను గురించి రష్యా భావం ఏమిటో ఇంకా తెలియరావడంలేదు. కాని ఆయన పశ్చిమ రాజ్యాల ఈ ప్రతిపాదనలను మెచ్చుకున్నారని, వీటిని బాగా పరిశీలించి, తన భావం ఏమిటో చెబుతానన్నారని, అమెరికా ప్రతినిధివర్గం తాలూకు మనుష్యులు చెబుతున్నారు.

శ్రీ స్టాసెన్ నేడు గంటసేపుకు పైగా, ఈ సమావేశంలో ఈ ప్రతిపాదనలను గూర్చి మాట్లాడారు. నిరాయుధీకరణం వ్యవహారాన్ని గురించి, సంధి కుదిరిన వెంటనే, ఈ పరీక్షల నిలుపుదల వ్యవహారం అమలులోకి వస్తుందని చెప్పారు.

అణ్వస్త్ర పరీక్షల నిలుపుదలను గురించి పాశ్చాత్య రాజ్యాల ప్రతిపాదనల పూర్తిపాఠం:- "అణ్వస్త్రపరీక్షలను పసిగట్టడానికి తగిన స్థల పరీక్షా కేంద్రాలను ఏర్పాటు చేయడాన్ని గురించిన సూత్రాన్ని రష్యా ఆమోదించడం సంతోషదాయకంగా వుంది. బ్రిటన్, కెనడా, ఫ్రాన్సు, అమెరికాలు, మొదటి నుంచీ కూడా ఇటువంటి పరీక్షా కేంద్రాల అవసరాన్ని గుర్తించి, అవి వుండాలని పట్టుబడుతూ వచ్చాయి. రష్యాఇందుకు అంగీకరించి, ఈ కేంద్రాలను రష్యాలోను, బ్రిటన్‌లోను, అమెరికాలోను, పసిఫిక్ ప్రాంతాలలోను నెలకొల్పాలని సూచించింది. ఇట్లా ఈ సూత్రాన్ని రష్యా ఆమోదించడంవల్ల, నిరాయుధీకరణ వ్యవహార ప్రథమ ఘట్టంలో ఒక భాగంగా, తాత్కాలికంగా అణ్వస్త్ర పరీక్షలను గూడా ఆపడం సాధ్యమౌతోంది.

"అయితే ఈ పరీక్షలను తాత్కాలికంగా నిలుపుదల చెయ్యడానికి గూడా కొన్ని షరతులు వున్నాయి. ఆ పరీక్షలు ఎంతకాలం నిలుపుదల చెయ్యాలి, ఎప్పుడు ఆ పని మొదలుపెట్టాలి, ఈ విషయాలు తేలవలసి వుంది. పరీక్షాకేంద్రాల స్థాపన వ్యవహారం పరిష్కారం కావలసివుంది. అంతేగాక, నిరాయుధీకరణ వ్యవహార ప్రథమ ఘట్టానికి, ఈ నిలుపుదల వ్యవహారానికి వుండవలసిన సంబంధాలు నిర్ణయంకావాలి.

"ఇట్లా తేల్చుకోవలసిన ఈ అంశాలలో ఈ క్రింది విషయాలు ప్రధానమైనవని మేము భావిస్తున్నాము. (1) ఆయుధాల పెరుగుదలను అరికట్టడానికి ప్రథమ చర్యలు. (2) సైన్యాలు, ఆయుధాలు తగ్గించుకోవడం విషయమై ఒప్పందం, (3) పరీక్షలకు అదుపులకు సంబంధించిన ప్రథమ చర్యలు (4) ఆయుధాలనిమిత్తం అణుద్రవ్యోత్పత్తిని ఆపుచెయ్యడం.

"ఇప్పుడు అణ్వస్త్రపరీక్షలను నిలుపుచెయ్యడం వ్యవహారాన్ని గురించి, పరీక్షాకేంద్రాలను, వాటిని ఏర్పాటు చేయడాన్ని గురించి, ఈ అయిదు రాజ్యాల ఆధ్వర్యంలోను నిపుణుల సమావేశం జరుగవలసింది. అది ఎప్పుడు జరగాలో ఈ రాజ్యాలు నిర్ణయించాలి. ఈ అంశానికి, అణ్వస్త్రపరీక్షల నిలుపుదలకు నిరాయుధీకరణ వ్యవహార ప్రథమ ఘట్టం తాలూకు ఇతర అంశాలకువున్న సంబంధాన్నిగూర్చి, ఈ ఉపసంఘం అగ్రసేనాధిపతి పరిశీలించాలి."

## పశ్చిమపాక్‌లో సమిష్టి నియోజక వర్గాలు

### అల్ప సంఖ్యాకులచే ఉద్యమ ప్రారంభం

లాహోర్, జూలై 2: పశ్చిమ పాకిస్తాన్‌లో ప్రజల కోరికకు విరుద్ధంగా ప్రవేశపెట్టిన సమిష్టి నియోజక వర్గాలను ప్రతిఘటించే ఉద్దేశ్యంతో క్రైస్తవులు, తదితర నిమ్న జాతి అల్ప సంఖ్యాకులు ఒక కార్యాచరణ సంఘాన్ని ఏర్పాటుచేశారు. ఈ పోరాటం రాజ్యాంగబద్ధంగా జరగాలని వీరు నిర్ణయించారు.

పాకిస్తాన్ పార్లమెంటు ఉపసభాపతి శ్రీ సి. ఇ. గిబ్బన్ యీ సంఘానికి అధ్యక్షులు.

రాజ్యాంగం అనుమతించిన ప్రతి చర్యద్వారా, యీ సమిష్టి నియోజక వర్గాలను ప్రతిఘటించాలని గత రాత్రి యీ అల్ప సంఖ్యాకుల వివిధసంఘాలు, సమావేశమై తీర్మానించాయి.

## అల్జీరియా సమస్య

### అమెరికా కల్పించుకోదు

వాషింగ్టన్, జూలై 2: అల్జీరియాకు స్వాతంత్ర్యం లభింపచేసేందుకు, అమెరికా కల్పించుకోవాలని, ఐసెన్‌హోవర్ ప్రభుత్వం కాంగ్రెసు యిందుకోసం పట్టుబట్టి తేవాలని, సెనెట్‌లోని ప్రముఖ డెమొక్రాట్ సభ్యుడు శ్రీ జాన్ కెన్నడీ సూచించారు. కాని అమెరికా విదేశాంగమంత్రి శ్రీ డల్లెస్ అలాంటిదేమీ చేయగడని, యివాళ పత్రికా విలేఖరుల సమావేశంలో స్పష్టం చేశారు.

శ్రీ జాన్ కెన్నడీ సెనేట్ విదేశాంగ వ్యవహారాల ఉపసంఘ అధ్యక్షుడు కూడా.

ఉత్తర అట్లాంటిక్ రాజ్యకూటమిద్వారా గాని, మొరాకో, ట్యునీషియాలద్వారా గాని, అల్జీరియా సమస్య పరిష్కారానికి అమెరికా ప్రభుత్వం తన పలుకుబడి వినియోగించేందుకు వీలుగా, కాంగ్రెసు ఉభయసభలలోనూ తీర్మానం తెస్తానని శ్రీ కెన్నడీ చెప్పారు.

ఉత్తరాఫ్రికాలో ఫ్రెంచి పలుకుబడి ప్రాబల్యం ఉండడం తనకు సమ్మతమే గాని, మొరాకో, ట్యునీషియాలకు ఇచ్చినట్లే అల్జీరియాకు కూడా ఫ్రాన్స్ స్వాతంత్ర్యం ఇవ్వాలి. ఇది ముందు జరగాల్సిన పని అని ఆయన అన్నారు. అల్జీరియా ఇప్పుడిక కేవలం ఫ్రాన్సుకు సంబంధించిన సమస్య మాత్రమే కాదని ఆయన స్పష్టంచేశారు.

అల్జీరియాలో తిరుగుబాటుదార్లతో పోరాటంలో ఫ్రాన్స్ ఇరుక్కుని పోయినందున ఐరోపాలో ఉత్తర అట్లాంటిక్ బలాలు బాగా తగ్గిపోయాయని, ఐరోపా సమిష్టి వ్యాపార ఆశలు సన్నగిల్లాయని, ఫ్రాన్స్ మళ్ళా దిగుమతులపై నిర్బంధాలు పెట్టవలసి రావడంతో, అంతర్జాతీయ వ్యాపారం సాఫల్యమయ్యే అవకాశం తగ్గిందని కెన్నడీ హెచ్చరించారు.

అల్జీరియా సమస్య పరిష్కారానికి యీలోగా ప్రయత్నాలు జరిగి అవి ఫలించక పోయినట్లయితే సెప్టెంబరు సమితి సమావేశం జరిగినప్పుడు అల్జీరియాకు సక్రమంగా స్వాతంత్ర్యం లభింపచేసేందుకు జరిగే ప్రయత్నాలను అమెరికా బలపర్చాలి అని ఆయన అన్నారు.

### అమెరికా వైఖరి

#### డల్లెస్ వివరణ

అల్జీరియా సమస్యా పరిష్కారానికి అమెరికా కల్పించుకోవాలనే సూచన డల్లెస్‌కు నచ్చలేదు. అటువంటి ప్రయత్నాలపై జరక్కుండా చన్నీళ్లు చల్లారు.

ఉత్తర అట్లాంటిక్ కూటమిద్వారా గాని, మరోవిధంగా గాని, అల్జీరియా స్వాతంత్ర్యం సంపాదించిపెట్టేందుకు అమెరికా తోడ్పడాలంటూ సెనెట్ సభ్యులిద్దరు కాంగ్రెసులో తీర్మానం పెట్టదలచిన సంగతి పత్రికావిలేఖరులు డల్లెస్ దృష్టికి తేగా ఆయన ఇలా అన్నారు.

"అల్జీరియా చాలా చిక్కు సమస్య. దీని పరిష్కార బాధ్యతలను మనకెత్తిన వేసుకోడం మంచిదిగాదు. దీని పరిష్కార ప్రయత్నంలో అమెరికా సహాయం ఎప్పుడు ఎవరు కోరినా లభిస్తుంది. అంతా పైన వేసుకొనేకన్నా, యీ విధంగా అమెరికా ఎక్కువగా తోడ్పడగలుగుతుంది."

"వలసరాజ్య తత్వం వెంటబడాలని ఎవరికైనా ఆసక్తి ఉంటే, ఫ్రాన్స్—అల్జీరియా కంటే మంచి చోట్లే ఉన్నాయి. తూర్పు యూరప్‌లో వలసరాజ్యతత్వం దుష్టంగా విజృంభిస్తోంది. దానివెంట పడవచ్చు" అని శ్రీ డల్లెస్ సలహా ఇచ్చారు.

# ప్రాజెక్టులు, పరిశ్రమలు జాతీయ దృక్పథంతో ఏర్పాటుకావాలి

## సంజీవరెడ్డి అభిప్రాయం

మదరాసు, జూలై 3: నదీలోయ ప్రాజక్టులను పరిశ్రమలను జాతీయ దృక్పథంతో ఏర్పాటు చేయాలని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి సూచించారు.

శ్రీ సంజీవరెడ్డి నిన్నరాత్రి రోటరీ క్లబ్‌లో మాట్లాడుతూ ఆంధ్రరాష్ట్రంలో జరిగిన పనిగూర్చి వివరపర్చారు. సమావేశానికి రోటరీక్లబ్ అధ్యక్షుడు శ్రీ కె. గోపాలరావు అధ్యక్షత వహించారు.

రాజకీయాలతో సంబంధంలేకుండా సేవయే ప్రధానంగా పెట్టుకొని పనిచేస్తున్నందుకు రోటరీ వుద్యమాన్ని అభినందించి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ఇంకా ఇల్లా అన్నారు: "భాషాప్రయుక్తంగా రాష్ట్ర విభజన జరగకుండా వుంటే అనేక క్లిష్టసమస్యలను ఎదుర్కోవలసి వచ్చేది. న్యాయంగా రావలసింది వచ్చి, జరగవలసింది న్యాయంగా జరుగుతోందనే భావం ఆంధ్రులలో ఏర్పడి ప్రశాంతంగా వున్నారు. ఆంధ్రరాష్ట్రం ఏర్పడకుండా వుంటే గత మూడేళ్ళలో జరిగిన పని జరిగి వుండేది కాదు.

ఆంధ్రలో కృష్ణా, గోదావరి, తుంగభద్రలాంటి మహానదులు వున్నాయి. గతకాలాబ్దంగా వాని జలాల వినియోగం సక్రమంగా జరగలేదు. వృథాగా సముద్రంపాలు అవుతున్నాయి నీళ్లు.

ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. గోదావరి నీటిని వృథాపోనివ్వదలచలేదు. వీలుంటే దక్షిణాదికి ఇవ్వాలనుకుంటున్నాం. ఇది నా వ్యక్తిగత అభిప్రాయంకాదు. మాలో చాలామంది అభిప్రాయం కూడా ఇదే: రు 121 కోట్లు ఖర్చుఅయ్యే బ్రహ్మాండమైన నాగార్జునసాగర్ ప్రాజక్టు నిర్మాణంలో వుంది. అది పూర్తిఅయ్యేసరికి రు 200 కోట్లు కూడాఖర్చు కావచ్చు. దానికింద 40 లక్షల యకరాలు సాగుఅవుతుంది. భాక్రా-నంగల్ తరువాత దేశంలోకల్లా పెద్ద ప్రాజక్టు ఇదే అవుతుంది. నిత్య క్షామ ప్రాంతాలకు లాభించేది గనుక తుంగభద్రప్రాజక్టుఅంటే నాకు మమకారం ఎక్కువ. కృష్ణా, గోదావరి, తుంగభద్రలమీద వంతెనలను నిర్మించవలసివుంది. ప్రజలకులాభించే అనేక పథకాలను సాహసంతో ప్రారంభించినందుకు ప్రకాశం పంతులుగారికి కృతజ్ఞత తెలుపవలసివుంది. కృష్ణా బారేజి నిర్మాణం ఈసంవత్సరాంతానికి పూర్తి అవుతుందని చెప్పారు. స్వల్పకాలంలోనే తిరుపతి వెంకటేశ్వర విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటుచేసుకో గలిగాం. మదరాసు సమిష్టిరాష్ట్రంలోవుంటే ఇవన్నీ సాధ్యమయ్యేవిగావు. ఉద్రేక పూరితులైన ఆంధ్రులు ఇప్పుడు శాంతించి వాస్తవదృక్పథంలోకి వచ్చారు. పోలీసు శాఖకు పనితగ్గింది. ఆంధ్ర ప్రాంతం ఇప్పుడు ప్రశాంతంగావుంది.

విశాలాంధ్ర ఏర్పడినతరువాత అనేక సంవత్సరాలుగా నిలిచిపోయిన అనేక పనులు జరిగిపోతున్నాయి. గోదావరి మిగులునీటినికృష్ణకుమళ్ళించి, కృష్ణనీటిని దక్షిణాదికి సరఫరాచేయాలనే ఆలోచనవుంది. రామపాదసాగరం, శ్రీశైలంలాంటి పథకాలు వున్నాయి. నదీలోయప్రాజక్టులను, పరిశ్రమలను జాతీయదృక్పథంతో అమలుజరపటం మంచిది. నూతన ఆంధ్రరాష్ట్రంలో పరిశ్రమలను అభివృద్ధిచేయటానికి వర్తకులను ఆహ్వానించాను. మదరాసు, ఆంధ్రప్రదేశ్ మధ్య వ్యాపార సంబంధాలు సన్నిహితంకావాలని చెప్పారు."

రోటరీక్లబ్ అధ్యక్షపదవినుండి విరమిస్తున్న శ్రీ హెచ్. సి. కోఠారి ఇది 29 వ వార్షికోత్సవంఅనీ, వందమంది సభ్యులువున్నారనీ చెప్పి నూతన అధ్యక్షుడు శ్రీ కె. గోపాలరావుకు అధ్యక్షతను, తొడిగారు. శ్రీ వి. ఎస్. శాస్త్రి వందనములర్పించారు.

నూతనసంవత్సరానికి ఈ క్రిందివారిని కార్యనిర్వాహకులుగా ఎన్నుకున్నారు: అధ్యక్షుడు-శ్రీ కె. గోపాలరావు, ఉపాధ్యక్షుడు-శ్రీ కే. వి. శ్రీనివాసన్, కార్యదర్శి-కే. నటరాజన్, సహాయ కార్యదర్శి- మహమ్మద్ ఆదంసేక్, కోశాధికారి-శ్రీ జి. ఎ. ఫాస్కీ.

### హైదరాబాదుకు ప్రయాణం

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి ఇవాళ ఉదయం విమానంలో హైదరాబాదు వెళ్లారు.

# పాక్‌లోని భారతీయ ఉద్యోగులపై హింసాకాండ

## ప్రయాణానుమతి పత్రాల నిరాకరణ

కరాచీ, జూలై 2: పాకిస్తాన్‌లో పనిచేస్తున్న భారతీయ ఉద్యోగులపై ప్రభుత్వం కొనసాగిస్తున్న హింసాకాండ క్రమంగా మితిమీరుతున్నదని ఒక ఉన్నత భారతీయ అధికారి చెప్పారు.

పాకిస్తాన్ ప్రభుత్వ అనుసరిస్తున్న ఈవిధానం భారతదేశంలోని పాకిస్తాన్ ఉద్యోగులపట్ల భారత ప్రభుత్వం ప్రదర్శిస్తున్న "ఉదాత్త వైఖరికి" పూర్తి విరుద్ధంగా ఉన్నదని వీరన్నారు.

భారతదేశంలోని పాకిస్తాన్ ఉద్యోగులు అక్కడే యింకా ఉండిపోయేందుకు గాను, ప్రయాణానుమతి పత్రాలను సంపాదించుకునేందుకు వీలుగా భారత ప్రభుత్వం, గడువు యిటీవలనే పొడుగించిందని కూడా వీరు తెలియజేశారు.

భారతదేశంలో మూడున్నర లక్షలపై చిలుకు పాకిస్తానీలు ఉద్యోగాలలో ఉండగా, తూర్పు పశ్చిమ పాకిస్తాన్‌లలో కలిసి 20, 30 వేలమంది భారతీయ ఉద్యోగులు మాత్రమే ఉన్నారు.

"అల్ప సంఖ్యాకులకు ముఖ్యంగా హిందువులకు పాకిస్తాన్ నుంచి పంపివేయటానికి పాకిస్తాన్ అధికారులు జరుపుతున్న యీ విధమైన హింసాకాండ యిప్పుడు క్రొత్తేమీ కాదు. వీరు ఇటీవల అవలంబిస్తున్న పద్ధతి, భారతీయ ఉద్యోగులకు ప్రయాణానుమతి పత్రాలను మంజూరు చేయకపోవటం, పాతవాటిని పునరుద్ధరించేందుకు నిరాకరించటం అని యీ భారతీయ అధికారి తెలియజేశారు.

పాకిస్తాన్ అనుసరిస్తున్న యీ విధానానికి, వీరు కొన్ని కారణాలను కూడా పేర్కొన్నారు.

# చైనాలో సోవియట్‌రష్యాలో పరిణామాత్మకమైన మార్పులు

## డల్లెస్ సిద్ధాంతం: విప్లవాలుకూడ జరగవచ్చునని జోశ్యం

వాషింగ్టన్, జులై 2: నిరాయుధీకరణ ఒప్పందంతో చైనాకు నిమిత్తం లేకుండా, ఆ నిరాయుధీకరణ వ్యవహారాన్ని గూర్చిన అదుపులను వాటిని ఏర్పాటు చేసుకోవచ్చునని, అమలుపరచుకోవచ్చునని, తనభావంగా అమెరికా విదేశాంగ మంత్రి శ్రీ డల్లెస్ నేడు వివరించారు.

ఆయన ఇలాఅన్నారు: "ఒక్క చైనాయేకాదు; మరికొన్ని దేశాలు గూడా ఈ ఒప్పందంలో వుండవు. అందరు ఈఒప్పందాన్ని ఆమోదించాలనే పద్ధతిమీద, అసలుఒప్పందమే కుదరదు."

ఇందులో అణ్వస్త్రాలను ఇతర దేశాలు ఉత్పత్తిచేసే ప్రమాదంలేదా అని విలేఖరులు శ్రీ డల్లెస్‌ను ప్రశ్నించారు. శ్రీ డల్లెస్ "అమాటనిజమే" అన్నారు. అయితే, ఇప్పుడు ఈ విషయంలో చేసుకునేఏర్పాట్లలో, ఒప్పందంతో నిమిత్తంలేకుండా, అదుపులు, పరిశోధనలుజరిగే ఏర్పాట్లను, అందుకే చేసుకోవలసి వుంటుందిఅన్నారు.

"అమెరికా ఇట్లా అనుకుంటోంది: అణ్వస్త్రాలు తయారుచేయాలంటే చైనాకు, రష్యాసహాయం అవసరం. రష్యా, చైనాకు అసహాయంచెయ్యదు. అందుచేత చైనాను ఇప్పుడు ఈ ఒప్పందాల్లోకి తీసుకురావలసినఅవసరంలేదు. ఇప్పుడు నిరాయుధీకరణం వ్యవహారంలో ఒప్పందంకుదిరితే, అందులో ఇట్లాఅని ఉదహరించాఅంటాము. ఇక, ఈఏర్పాటును, ఎవరు భంగం చేసినా, వెంటనే తెలిసిపోతుంది. దానితో, అసలు ఒప్పందంమే రద్దయి పోతుంది.

"అందువల్ల, చైనాకు ఈ ఒప్పందంతో నిమిత్తం లేకుండా, ఆ ఒప్పందంలోని అంశాలను పాలించడం మేరకు సంబంధం వుండేట్లు, ఈ వ్యవహారాన్ని నడిపించవలసివుంది. ఇది ఇట్లా కుదిరితే కపోతే, అసలు ఒప్పందమే వుండదు ఇటువంటి ఒత్తిడిని రష్యామీదతెస్తే, చైనా మెదలకుండా వూరుకుంటూ వుంటుంది.

"చైనాకు స్వంతంగా అణ్వస్త్రాలను నిర్మించేశక్తి వుందా అంటే, నేను ఖచ్చితంగా ఏమీచెప్పలేను. ఆశక్తి చైనాకు లేదనే నాభావం; అయితే, పూర్తిగా అట్లా అనలేను. అదీకాక, ఇది డబ్బుఖర్చుతో కూడినపని పైగా, అణ్వస్త్రంచేల్చి, వాయడం తేలిక కాదు."

చైనా వచ్చి సంతకం చెయ్యకుండా ఏ నిరాయుధీకరణ సమాధానం అయినా సాధ్యం అవుతుందా? ఖచ్చితంగా చెప్పండి? అని విలేఖరులు శ్రీ డల్లెస్‌ను నిగ్గదీశారు.

శ్రీ డల్లెస్ ఆటువంటి సమాధానం కుదరడం సాధ్యంకావచ్చు నన్నారు. అందుకు చైనా దగ్గరనుంచి కొన్ని వాగ్దానాలను గూడా పుచ్చుకోవచ్చునన్నారు. అట్లా కొరియా, ఇండో చైనా వ్యవహారాలు పుచ్చుకున్నామని, అట్లాగే, ఇప్పుడు జరగవచ్చునని శ్రీ డల్లెస్ భావిస్తున్నారు.

శ్రీ డల్లెస్ ఈమధ్య, శాన్‌ఫ్రాన్‌సిస్కోలో అంతర్జాతీయ కమ్యూనిజంను గురించి మాటలాడారు. అందులో గూడా, ఈ మార్పుల ప్రసక్తి వచ్చింది. నేడు విలేఖరులు శ్రీ డల్లెస్, ఆమార్పుల సంగతి ఏమిటో వివరించవలసిందని అడిగారు. ఈ మార్పులు అంటే, పెదవాన్ల దండయాత్ర జరగడంవల్ల వస్తాయా, లేకపోతే టిటో తత్వం పెరగడంవల్ల వస్తాయా? అని ప్రశ్నించారు.

అప్పుడు శ్రీడల్లెస్ ఇట్లు సమాధానం ఇచ్చారు: "చైనాలో కానీయండి,మరి ఇంకోచోట కానీయండి, నిరంకుశ ప్రభుత్వాలు ఆట్టే కాలంనిలవ్వు. ప్రజలను అభిమతాలను ఎరిగి పనిచేసే ప్రభుత్వాలు, ప్రపంచంలో వైవిధ్యాలను అంగీకరించే ప్రభుత్వాలు మాత్రమే నిలుస్తాయి; వాటికే భవిష్యత్తు వుంది. అమెరికాలో ప్రభుత్వం ఇట్లాగే సాగుతోంది.

"రష్యాకుగూడా ఇదే సూత్రంపడుతుంది. అందువల్లనే, రష్యాలో, పరిణామాత్మకంగా మార్పులుతప్పవని అమెరికా విశ్వసిస్తోంది. పరిణామంఅని అంటున్నానే గాని, విప్లవంగూడా రావచ్చు. అదిగూడా సాధ్యమే.

"ఇప్పుడే రష్యాలో వ్యక్తి స్వాతంత్ర్యం అంటే ప్రేమ అధికం అవుతోంది. ఇది ఇట్లాగే సాగుతుందని నాకు అనిపిస్తోంది.

"అయితే ఈ మార్పులు ఫలానా కాలంలోగా వస్తాయని నన్ను చెప్పమంటే చెప్పలేను. ఇందు సంవత్సరం పట్టవచ్చు, ఐదుసంవత్సరాలుపట్టవచ్చు, పది సంవత్సరాలు పట్టవచ్చు. అయితే మార్పులు మాత్రం రాక తప్పదు.

"చైనా సంగతి చూస్తే, అక్కడ విప్లవాత్మకశక్తులు అధికంగా వున్నట్లు కన్పిస్తుంది. మొత్తం మీద రష్యాలో కంటే, ఎక్కువగా ఈ శక్తులు, చైనాలో వున్నాయి. ఇంతమాత్రం చేత చైనాలో విప్లవం వస్తుందని నేను అనను, కానిఅటువంటి శక్తులు వున్నాయంటాను.

"చైనాపట్ల అమెరికావిధానం మారాలంటే, ముందు చైనా పద్ధతి మారాలి. అంతర్జాతీయంగా చైనా పద్ధతి మారాలి. అందాకా చైనాను అమెరికా గుర్తించడం అంటూ పడదు."

## చైనా లేకుండా నిరాయుధీకరణ

వాషింగ్టన్ జులై 2: రష్యాలోను, చైనాలో నుపరిణామాత్మకమైనమార్పులు రాక తప్పదని అమెరికా విదేశాంగ మంత్రి నేడు జోశ్యం చెప్పారు.



Printed and Published for Nageswara Rao Estate (private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1, Editor S. Sambhuprasad.

## ఆంధ్ర ఆయవ్యయ నివేదిక

(1 వ పుట తరువాయి)

నిర్మాణ కార్యక్రమానికి కావలసిన ధనంకోసం, మనం కేంద్ర ప్రభుత్వం మీద, ఆరోజుకారోజు, యెక్కువగా ఆధారపడుతున్నా మనదానికి సందేహంలేదు. ఎంతవరకు ఆధారపడుతున్నామో, అంతవరకు మన ఆర్థిక వ్యవస్థ తారుమారు అవుతున్నది. అంతవరకు మన స్వేచ్ఛ, మన స్వాతంత్ర్యం భంగపడుతున్నవి. యావత్తు భారతదేశంలో ఒకే విధమైన వ్యవహార వ్యవస్థ స్థాపించాలనే ఆశయంవల్లనూ, ఆ ఆశయం అమలుపరచడం వల్లనూ కొంత మంచీ, కొన్ని విధాల కొంత చెడ్డాకూడా వున్నవి. భారత ప్రభుత్వంగానీ, రిజర్వు బ్యాంకుగానీ, రివిన్యూ ఖాతాలో, పెట్టుబడి ఖాతాలో, మనకి కావలసిన ధనమంతా ఇచ్చే పరిస్థితిలో ఉన్నారని సభవారు భావించకూడదని నా మనవి. వారికీ మనకీ మధ్య కొన్ని ఒప్పందాలు ఉన్నవి. అవి అతిక్రమించి వారు వెళ్ళడానికి సిద్ధంగా లేరు, రాష్ట్రాలకిచ్చిన హామీలు దాటి వారు వెళ్లదలచుకోలేదు. రిజర్వుబ్యాంకు ఒక చట్టం అనుసరించాలి. ఆ చట్టం ప్రకారం ప్రదేశ ప్రభుత్వాలకి తాత్కాలిక సహాయంగా కొద్ది కాలానికి కొంత డబ్బు పెట్టుబడిమీద వడ్డీ వసూలు చేస్తారు. నిజానికి మనం చేసుకున్న ఒప్పందం ప్రకారం, రిజర్వుబ్యాంకులో మన రాష్ట్ర తరఫున వడ్డీ లేకుండా ముప్పది లక్షల రూపాయలు ఎల్లకాలమూ నిలువచేసి వుంచాలి. ఆ మొత్తం మేరకు మన నిలువ ఎప్పుడు తక్కువ అవుతుందో ఆ తక్కువైన సొమ్మమీద మనం వడ్డీ కట్టుకోవాలి. ప్రస్తుతం మన బాపతు నిలవసొమ్ము వారిదగ్గరలేదు సరికదా రిజర్వుబ్యాంకివద్దనుంచి మనం 12 కోట్ల రూపాయిలకు పైగా అప్పుకూడా తెచ్చుకున్నాము. ఈ అప్పు విలువ యెక్కువయినకొద్దీ వడ్డీ రేటుకూడా యెక్కువవుతుంది.

భారత ప్రభుత్వంవారు రిజర్వు బ్యాంకువారుకూడా పదేపదే ఈ సంగతి మనకు జ్ఞాపకంచేసి ఇవ్వవలసిన సొమ్ము సర్దుబాటు చేయవలసినదిగా హెచ్చరిస్తున్నారు. మన ఆర్థికపరిస్థితి గమనించుకోవలసినదిగా కోరుతున్నారు. పంచవర్ష ప్రణాళికకోసం రాష్ట్రంలో అయే ఖర్చులన్నీ కేంద్రప్రభుత్వం భరిస్తుందని ఎక్కడా లేదు. ప్రణాళిక, కేంద్రం ఏర్పాటుచేయగా, రాష్ట్రాలు రూపొందిస్తున్నాయనిభావించకూడదు. ఏ రాష్ట్ర ప్రణాళిక ఆ రాష్ట్రానికి సంబంధించినదే. కేంద్ర ప్రభుత్వం, సహాయార్థం విరాళాలుగాని, అప్పులుగాని, మంజూరు చేస్తున్నది. వీలైనంతవరకు మన ఖర్చులకుగాను మనమే ధనం సాధించాలి. ఆ సేకరణ పన్నుల రూపంలో వుండవచ్చు. ఋణాల రూపంలో వుండవచ్చు. చిన్న చిన్న మొత్తాల పొదుపు ఉద్యమంద్వారా కావచ్చు.

### బీద అరుపుల వ్యాధి

నేను సమర్పించే ఆంధ్ర ప్రదేశ ఆర్థిక చిత్రం సభ్యులు సమగ్రంగా పరిశీలించినట్లయితే మన పరిస్థితి ఎంత శోచనీయముగా వున్నదో విశదమవుతుంది. ఇట్టి విషమపరిస్థితిలో నిమ్మకు నీరెత్తినట్లు మనం నిశ్చలంగా వుండడానికి వీలులేదు. చేతులు కాలినతరువాత ఆకులు పట్టినట్టుగా చెయ్యి మించినతరువాత చర్యలు తీసుకొందుకు ప్రయత్నంచేసి లాభంలేదు. వెంటనే, ముందు వెనుకలు ఆలోచించి, తగిన ఉపాయం సాధించి మన ఆర్థికపరిస్థితిని బాగుచేసుకోవలసిన అత్యవసరం మనల్ని చేరిపొరచూస్తున్నది. మన బడ్జెటులలో లోటులు అలవాటులైపోయినవి. ఇవి ఒక జాడ్యంగా, దీర్ఘవ్యాధిగా పరిణమించినవి. దొంగ రోగంకూడా కాదు. ప్రత్యక్షంగా కనబడుతున్న బహిరంగ వ్యాధి. అయినా, మనకు చీమ కుట్టినట్లు లేదు. వాటి విషయమై ఆలోచన లేదు. తొందర లేదు. ఒక విశ్వాసాత్మకమైన దృక్పథంకూడా లేదు. ఈ తరుణంలో ఉర్దూ మహాకవి మీర్జా గాలిబ్ చెప్పిన రెండు చరణాలు నాకు జ్ఞాపకం వస్తున్నవి.

వాక్కి మేరకు ఆ చరణాల తాత్పర్యం తెలుగు భాషలో వివరిస్తాను:

"అలవాటు పడిన అసుఖం అంతగా అనిపించదు మనకు
అది కరిగిపోతుంది, క్రమంగా కరిగిపోతుంది;
నా బ్రతుకుమీద దండెత్తిన రకరకాల కష్టపరంపర,
నా మీద చల్లిన పన్నీటి తుంపర
మేని వైభోగమయింది, బ్రతుకులో భాగమయింది.
అనుభూతికి సులభమయింది,
బాధాపు సుఖమయింది.

కవి వాక్కు యథార్థం. మన కష్టాలకి మనం అలవాటు పడిపోయినాము. వాటి విషయమై మనకు చింత లేదు. పట్టింపు లేదు. ఆ కష్టాలు మనకు భారంగానే లేవు. ఇది ఆరోగ్యకరమైన దృక్పథం కాదు. ఏ రాష్ట్ర ప్రభుత్వమైనా, యెంత సంపద కలిగినదైనా, ముందు వెనుకలు చూసుకోకుండా, తన ఆదాయ వ్యయాలతో నిమిత్తంలేకుండా, ఋణ భారం నిర్లక్ష్యంచేసి, కట్టవలసిన వడ్డీలు మరచిపోయి, దైనందిన వ్యవహారంలో విరివిగా ఖర్చు సాగించడం శ్రేయస్కరం కాదు.

### సహాయాన్ని వాడుకోవడంలేదు

ఆర్థికంగా బలహీనమైన కొన్ని రాష్ట్రాలు, సరిసరి గ్రాంట్లు ఇచ్చే కేంద్రప్రభుత్వ విధానాన్ని పూర్తిగా వినియోగించుకొని ప్రయోజనం పొందడంలేదు. మన విషయంలో ఇటువంటి పరిస్థితి అనేకసార్లు సంభవించింది. మన ఆర్థిక దుస్థితి కారణంగా, ఖర్చులో సగంవంతు కూడా భరించుకోలేక, కేంద్రప్రభుత్వం చేస్తానన్న సహాయం, గత్యంతరంలేక వదలుకోవలసి వచ్చిన పరిస్థితులు నాకు స్ఫురణకు వస్తున్నవి. ఉదాహరణకు, ఉపాధ్యాయుల జీతాల విషయం తీసుకుందాం, కొంత మనం భరిస్తే, కేంద్రప్రభుత్వం మిగిలినది భరించడానికి అంగీకరించింది. కాని మనం భరించవలసిన ఆ కొంతభాగమే మనకు దుర్భరమైపోయింది. ఇప్పటికే పెద్దపెద్ద లోటు బడ్జెట్లతో సతమతమవుతూ, ఈ భారాన్నికూడా వహించి ఇంకా లోటు పెంచుకోడానికి భయపడుతున్నాము. పర్యవసానం ఏమంటే కేంద్రప్రభుత్వం యిస్తానన్న సహాయం మనం వినియోగించుకోలేక పోతున్నాము. పైగా వేలాది ఉపాధ్యాయులకు అసంతృప్తికరమైన పరిస్థితికూడా ఏర్పడింది. చివరకు పోలీసు గృహవసతి వంటి కార్యక్రమాలకుకూడా, మనం కొంత మొత్తం వెచ్చించగలిగితేనే, అంత మొత్తం వడ్డీతోకూడిన ఋణంగా కేంద్రప్రభుత్వం మంజూరుచేస్తుంది. ఆర్థికంగా బలహీనమైన రాష్ట్రాలమీద ఈ పరిస్థితుల ప్రభావం ఎక్కువగా పడుతున్నది. కేంద్రప్రభుత్వ విధానం వల్ల కలిగే ప్రయోజనాలను ఆర్థిక స్తోమత గల రాష్ట్రాలుమాత్రమే పొందగలుగుతున్నవనీ, లేని రాష్ట్రాల పరిస్థితి "ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్లు" వున్నదనీ, ఆర్థిక విచారణ ఉన్నతాధికార సంఘానికి మనం సమర్పించిన నివేదికలో విశదీకరించినాము.

### ఖర్చులిలా అదుపులో లేవు

ఖర్చులను అదుపులో పెట్టుకోవడం కూడా మనకు చాలాకష్టంగానే వుంది. భారతప్రభుత్వం, ఏదో ఒక సంస్థను ఏర్పాటు చేసి, దానికి వివిధకాల భోగట్టా కావాలని కోరుతుంది. ఆ విషయాలన్నీ సేకరించడానికి కొత్త శాఖలు ఏర్పాటుచేయవలసిన అవసరం మనకు కలుగుతుంది. అదేవిధంగా, వాళ్లు ఏదొఒక పథకాన్ని ప్రారంభిస్తారు. దానిమీద ఒకేసారి అయే ఖర్చులోనూ, ఏటేటా అయే ఖర్చుల్లోనూ, కొంతభాగం భరించమని మన్ని కోర్తారు. మనమేమో, అన్నిపనులు ఒక్కసారే చేసేద్దాం అనే ... తో వుంటాం. అతిత్వరలో నిర్దిష్ట లక్ష్యాలను సాధించి, ప్రజల కోరికలు సాధ్యమైనంతత్వరలో తీర్చి వారిని సంతృప్తి పరచాలనే ఉత్సాహంతో మనం పని చేస్తూ వుంటాం. కాని, కేవలం ప్రజల సమస్యలు సానుభూతితో తెలుసుకున్నంతమాత్రాన, ఉత్సాహంతో ఉద్రూతలూగినంత మాత్రాన ఏంజరుగుతుంది? ధనమూల మిదంజగత్; మనకు వున్న వివిధ అవకాశాలను వినియోగించుకొని వాటిని డబ్బురూపంలోకి మార్చుకోవాలి. ఇందులో నేనేమీ క్రొత్త విషయాలు చెప్పటంలేదని నాకూ తెలుసు. కాని సందర్భానుసారంగా, తెలిసిన విషయాలే మళ్లీ తెలియచెప్పటానికి ప్రయత్నిస్తున్నాను. మనకు తెలిసినవి పాతవిషయాలే అయినప్పటికీ, వాటిని ఒకసారికి రెండుసార్లు మననం చేసుకోవలసిన పరిస్థితిలో మనం వున్నాం.

### రివిన్యూలోట్లు

నా ప్రసంగానికి ఉపోద్ఘాత ప్రాయంగా ఇంతవరకు చెప్పిన విశేషాలు ముగించి, మన ఆర్థిక పరిస్థితుల యదార్థస్వరూపం సమర్పిస్తాను. 1954-55 సంవత్సరంనుండి మన రివిన్యూ లోటు ఎలాఉన్నదంటే; 1954-55 సంవత్సరపు లెక్కలప్రకారం ఆంధ్ర ప్రాంతంలో లోటు 5 కోట్ల 18 లక్షల రూపాయిలు. ఆదేసంవత్సరం తెలంగాణ ప్రాంతంలో లోటు 51 లక్షలు. అనగా మొత్తం ఆంధ్ర ప్రదేశానికి 5 కోట్ల 69 లక్షల రూపాయిలు రివిన్యూ తరుగు.

1955-56 సంవత్సరపు లెక్కల ప్రకారం ఆంధ్రలో లోటు 5 కోట్ల 29 లక్షలు; తెలంగాణాలో 1 కోటి 70 లక్షలు. మొత్తం 6 కోట్ల 99లక్షలు

1956-57 సవరించిన అంచనాల, ప్రకారం ఆంధ్రలో లోటు 2 కోట్ల 28 లక్షలు; తెలంగాణాలో 2 కోట్ల 25 లక్షలు. మొత్తం 4 కోట్ల 68 లక్షలు.

1957-58 అనగా ప్రస్తుత ఆర్థికసంవత్సరం అంచనాల ప్రకారం ఆంధ్ర ప్రాంతపు లోటు 2 కోట్ల 48 లక్షలు; తెలంగాణపు లోటు 3 కోట్ల 5 లక్షలు. మొత్తం 5 కోట్ల 48 లక్షలు.

1953-54 సంవత్సరపు ఉత్తరార్థంలో ఆంధ్రలో వచ్చినలోటు 1కోటి 14 లక్షలుకాక, ఆంధ్రకు మొత్తం 15 కోట్ల 38 లక్షలూ, తెలంగాణాకు మొత్తం 7 కోట్ల 51 లక్షలూ లోటు కనిపిస్తున్నది. అంటే 4½ సంవత్సరాల కాలంలో ఏర్పడిన మొత్తంలోటు 28 కోట్ల 98 లక్షలు. ఇది కేవలం రివిన్యూ ఖాతాలో ఏర్పడిన లోటుమాత్రమే. కర్నూలు, హైదరాబాదు నగరాలలో భవనాలకోసం మనం చేసినఖర్చు, నీటిపారుదల, విద్యుచ్ఛక్తి పథకాల మీద చేయబడుతున్న ఖర్చు ఈఖాతాలోకి రావు. మన దైనందిన పరిపాలనా నిర్వహణ వ్యవహారాలలోనే ఇంతలోటు వచ్చింది. ఈనాలుగున్నర సంవత్సరాల మీదా వచ్చినలోటు మొత్తంమీద వడ్డీ సంవత్సరానికి సుమారు 95 లక్షలవరకు వుంటుంది. ఆంధ్ర లోటుప్రాంతమనీ, తెలంగాణా మిగులు ప్రాంతమనీ, తెలంగాణాలో ఒక అభిప్రాయం వ్యాప్తిలో వుంది. ఇది సహేతుకమైన అభిప్రాయం కాదు. ఇప్పుడిచ్చిన సంఖ్యల దృష్ట్యానూ, ఈ సంవత్సరపు లెక్కల దృష్ట్యానూ చూస్తే, ఆంధ్రకంటే తెలంగాణా ప్రాంతంలోనే లోటు పెరుగుతున్నట్లు విశదమవుతుంది. అయితే ఎప్పుడో ఒకప్పుడు తెలంగాణా ప్రాంతంకూడా అభివృద్ధిచెంది ఆంధ్ర ప్రాంతంతో సమాన స్థాయిని పొందవలసి వున్నది కనుక ప్రారంభదశలోనే ఈ లక్ష్య సాధనకు అధికంగా డబ్బు ఖర్చుపెట్టవలసిన పరిస్థితి కలగడం సహజం.

ఈ సందర్భంలో తెలంగాణా మిత్రులకు ఒక హామీ ఇస్తున్నాను. తెలంగాణా ప్రాంతంలో వసూలైనది ప్రతి రూపాయికీ విడిగా లెక్కలు వ్రాసే ఏర్పాటు జరుగుతున్నది. తెలంగాణా డబ్బును ఆంధ్ర ప్రాంతపు అభివృద్ధికి వినియోగిస్తారనే భయానికి ఎంతమాత్రం తావులేదు. ఈ సందర్భంలో యిచ్చిన హామీలన్నీ అక్షరాలా అమలు జరుగుతాయి.

### ఆదాయం పెరుగుదల

కాగా, మన ఆర్థిక పరిస్థితి పూర్తి అంధకారబంధురంగా లేదు. చిమ్మచీకటిలో దారిచూపే మృగశిరా నక్షత్రంవలే,గురు శుక్ర గ్రహాలవలే తేజోరాసులు వుండనే వున్నవి. అవే మనకు మార్గదర్శకములు. మన ఆదాయం పెరుగుతూ వుండడం అభిలషణీయమైన లక్షణం. మన ఆర్థిక పరిస్థితిలో కలిగిన ఈ సత్పరిణామం ముదావహమైనది. గడిచిన మూడు సంవత్సరాల కాలంలో ఆంధ్రప్రాంతంలో ఆదాయం హర్షింపదగినట్లుగా పెరిగింది. 1954-55 సంవత్సరపు ఆదాయం 19 కోట్ల 82 లక్షలు. 1957-58 సంవత్సరపు ఈ ఆదాయం 32 కోట్ల 22 లక్షల వరకూ, అంటే 62.6 శాతం పెరిగింది. ఆ యేటి కాయేడు మన ఆదాయం ఎల్లా పెరిగిందంటే:—

| | |
|---|---|
| 1954-55 లెక్కలు | 19 కోట్ల 82 లక్షలు |
| 1955-56 లెక్కలు | 23 కోట్ల 55 లక్షలు |
| 1956-57 సవరించబడిన అంచనా | 28 కోట్ల 17 లక్షలు |
| 1957-58 బడ్జెటు అంచనా | 32 కోట్ల 22 లక్షలు |

ఈ సంఖ్యలు సవిమర్శకంగా పరిశీలిస్తే, 1954-55 కంటే, 1957-58 నాటికి రూ. 12 కోట్ల 49 లక్షలు అధికాదాయం వచ్చినట్లు తెలుస్తున్నది. లభించిన పన్నులేమంటే:

(5 పుట చూడుడు)